# దయ్యాలు

స్థానాపతి రుక్మిణమ్మ



సరస్వతీగ్రంథమండలి
రాజమహేంద్రవరము

సర్వాఙ్గసుందరమూ,

విశ్వవ్యాప్తమూ అయిన

ఆనందజ్యోతికి

అంకితము.

# విన్నపం



"దయ్యాలకథలు" ఆంధ్రదేశంలో అనుశ్రుతంగా చెప్పుకుంటూన్నవి. ఇవి నేను విన్నవీ: కొన్ని నా పతిగారు వారిమిత్రుల నుండి విని చెప్పినవీని. తొలుత వినోదానికి వ్రాసిన ఒక్క "ఘనాపాఠి" కథ కారణంగా చివరికి పుస్తకందాకా పెరిగాయి. ఉద్దేశ్యం? —పిన్నకథలొక్క దగ్గరచేర్చడమే. విన్న కథల్లో ప్రస్తుతం కొన్నింటినే తీసుకొన్నాను. తర్వాత తక్కినవి.

"కవి" అనే కథ శ్లోకరూపం ప్రచారంలో వున్నదే. దాన్ని మార్చివ్రాశాను మచ్చుకి. కథల్లోని స్థలాల పేర్లూ, పాత్రల పేర్లూ కొన్ని కల్పితాలు, కొన్ని యథార్థాలూనూ.

"ప్రతిబింబాలు" సుప్రసిద్ధాధునిక జాతీయకవులు బ్రహ్మశ్రీ. మంగిపూడి వేంకటశర్మగారు చెప్పినది. అది కథా విధానంకోసం బాగా మార్చబడింది. కథలన్నీ విద్యాధికుల నుండి గ్రహించినవే.

'ఘనాపాఠి' 'పిడకలమల్లు భొట్లు' 'కవి' 'గంధర్వుడు' 'కొరివి' విశాఖపత్రికలోనూ, 'దేవతా? దయ్యమా?' ఆంధ్రవిద్యార్థిలోనూ, 'బుచ్చి' సత్యవాణిలోనూ ప్రకటించాను.

కథారచనకిదే ప్రథమ ప్రయత్నం. లోపాలు చాలా వుంటాయి. అందుకు—బాల్యం. అనుభవంతక్కువా, ఉత్సాహ మెక్కువాను.

ఈచిన్నపుస్తకం తమ గ్రంథమాలికలో ప్రకటించి కథారచనకు ఉత్సాహం కలిగించిన ఈ సంస్థాపకులు మహారాజశ్రీ. అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయుడుగారికీ, శ్రమయనక ప్రూఫులు దిద్ది నాకెన్నివిధాలా తోడ్పడిన శ్రీయుత. మొసలికంటి సంజీవరావుగారికీ కృతజ్ఞతా పూర్వక నమస్కారాలు.

మకాం,
నిడదవోలు.
౨౮-౧-౩౨.

పు. సాం. శి. రుక్మిణమ్మ.

# దయ్యాలు

# ఘనాపాఠి

కాశీ మహాపట్నం. కృష్ణపక్షము. అర్థరాత్రి. వీథులు కళావిహీనములు. నక్షత్రకాంతి తప్ప మరి ఏకాంతీలేదు. ఎక్కడో మినుకు మినుకుమంటూ లెఖదీపాలు అవసాన కాలాన్ని తెలుపుతున్నాయి. అంచేత దీపాలు లేనట్టే లెఖ.

ఆవీథి చాలాకాలంనుంచీ తుడిచినట్టుకూడా లేదు. గబ్బిలాలు కీచుకీచు మంటున్నాయి. గోడలనంటి తిరుగుతూవున్న అదృశ్యవ్యక్తులసడి. వీథిలో మధ్యమధ్య మహావృక్షాలు. ఉండి ఉండి నక్కలఊళలు. గాలి. గంగాభవాని కెరటాలహోరు వినిపిస్తూందప్పుడప్పుడు. ఇరువేపులా మహోన్నత సౌధాలు. మనుష్యులులేరు. కాని, ఏదోసడీ, నిట్టూర్పులూ వినిపిస్తున్నాయి. శవాల్ని కాలుస్తూన్న ధూమం ముక్కంటుతూంది. అల్లాంటి వీథిలోపడి తిరుగుతున్నాడో వ్యక్తి. ఆకలితో తిరుగుతున్నాడు. ఆహ్వానించేవాళ్లెక్కడక్కడా? అన్నంపెట్టే అన్నపూర్ణకూడా కనుపించదు. ఎవ్వరూకనుపించరు. వీథికిపట్టిన

# దయ్యాలు

బూజు ఆవ్యక్తి నిండా అంటుకొంది. కాళ్లుచుట్టుకుపోతూ ఆచివరినుండి ఈచివరికీ, ఈచివరనుండి ఆచివరకీ తూలిపోతూ నడుస్తున్నాడు. మధ్య 'ఆకలీ' అన్న హీనస్వరం విడుస్తున్నాడు. నిస్సత్తువచేత క్రిందపడి నెమ్మదిగాలేస్తూ నడుస్తున్నాడు. అలసటచేత తల గోడల్ని ఆనుకొంటున్నాడు. అంతకంతకి శ్రుతికందని స్వరమౌతూంది. ఆదరించి ఆహారంపెట్టేవారేరి? లేరు. శ్వాస సన్నగిలుతూంది. అల్లాంటిస్థితిలో సామగానమూ, శాస్త్రచర్చా వినిపించాయావ్యక్తికి. మెల్లగా అక్కడికి చేరాడతి ప్రయాసంతో. నీవెవరు? ఏవూరు? ఏమికావాలి? అన్నాడు అరుగుమీద కూర్చున్నపండితుడు. ప్రత్యుత్తరంలేదు. ఇంట్లోకి తీసుకువెళ్లి భోజనంపెట్టాడు. ఆవ్యక్తికి ప్రాణాలుగూట పడ్డాయి. ఇల్లాఅన్నాడు.

“మేము ముగ్గురుసోదరులము. నేనే చిన్నవాణ్ణి. వారిద్దరూ వేదశాస్త్రాల్లో ఆరితేరినవిద్వాంసులు. భార్యలు కాపరానికివచ్చారు. నెలపిల్లవాణ్ణై ఉండగానే నాతలిదండ్రులు గతించారు. అన్నలే తల్లీ, తండ్రీఅయ్యారు. భయమంటే ఏమిటో నాకు తెలీదు. పదహారేళ్లువచ్చాయి. అక్షరస్వరూపం ఎల్లాంటిదో తెలియదు. నిరక్షరకుక్షిని. దేశదిమ్మరంటారందరూ. పనిపాట్లేమీ చేతకావు. తినడం తప్పితే ఇంట్లో ఏపనీ

చెయ్యను. వదినెలు తిరస్కారంగా చూసేవారు. వారిచేత తిరస్కరింప పడనిక్షణంలేదు. ఎన్నెన్ని తిరస్కారాలైనా నన్ను కాదని తిరిగేవాణ్ణి. ఓనాడు పెద్దవదినె గంజీ, అన్నంపెట్టి, 'చదువా, సంధ్యాలేని నిరక్షరకుక్షికి ముప్పొద్దులా మూడు కంచాలూ ఎల్లావస్తా' యని దుర్భాషలాడింది. ఆమాటలికి తాళంవేసింది చిన్నవదినె.

ఆమాటలు వినేసరికి నోటిలోనికబళం జారి కంచంలో పడింది. కంచమంతా కన్నీళ్లతో నిండిపోయింది. ఎవరినీ ఏమీ అనలేదు. ఇదంతా చూస్తూన్న అన్నలు ఏమీఅనలేదు. అన్నం తినకుండా లేచిపోయాను. పరిపూర్ణపాండిత్యం సంపాదించే వరకూ ఇంటికిరాకూడదని మనస్సా ప్రమాణం చేసుకొన్నాను. కాశీలో చదువుకోడానికి నిశ్చయించాను. 'కాశీకి వెళ్లడమంటే కాటికివెళ్లడమే' అన్నమాట నాకు తెలుసును. ప్రాణానికి తెగించిన నాకు భయమేమిటనుకొన్నాను. కాలినడకని ప్రయాణంసాగిస్తూ సాగిస్తూ ఇక్కడ కిదేరావడం. ఎల్లావచ్చానో నాకేమీ తెలియదు. రెండురోజులై ఆహారం దొరకలేదు. నాపేరుసర్వమంగళుడు*. తన స్థితిగతులన్నీ దాపరికంలేకుండా నివేదించాడావ్యక్తి. ఆమాటలికి సంతోషించా డాపండితుడు. పన్నెండు సంవత్సరాలు గుమ్మందాటకుండా నా ఆజ్ఞలో ఉండి చదువుకొంటే సకలవిద్యలూ చెప్తాతాను, ఉంటావా ?

అన్నాడు. వెంటనే ఆయనపాదాలు పట్టుకొని తప్పక ఉంటానన్నాడు; మహాపండితుణ్ణి చెయ్యండని గొల్లున ఏడ్చాడు. పండితుడు సర్వమంగళుని ఊరడించి అభయహస్తమిచ్చాడు. తమ పేరేమిటన్నాడు సర్వమంగళుడు. నా పేరు ఘనాపాఠి. రేపు విద్యారంభానికి దివ్యంగా ఉంది, చదువుప్రారంభించమన్నాడు పంచాంగంచూసి.

ఘనాపాఠీమందిరం ఇంటినే అంటిఉన్న పెద్దతోటలో చివర ఉంది. అందులో సర్వమంగళు డతిదీక్షగా చదువుతున్నాడు. గురువూ, తానూతప్ప ఆ మందిరంలోకి ఎవరూ వెళ్లరు. ఎప్పుడూ నిశ్శబ్దంగా ఉంటుంది. భోజనానికి ఏ రెండునిమిషాలో తప్ప తక్కినకాలంలో ఆ మందిరాన్ని విడిచిఉండడు. విశ్రాంతి వేళకూడా గురువుతోపాటు తోటపని చేసేవాడు.

కావ్యాలూ, నాటకాలూ పూర్తి అయ్యాయి. కొంత జ్ఞానం కలిగింది సర్వమంగళునికి. పాఠం చెపుతూన్న గురువొక్కొక్కప్పుడు కనుపించేవాడు కాదు. కాని, పాఠం వినిపించేది. తిరిగి అతను కనిపించేముందు అపూర్వసువాసన వేసేది. చూస్తూండగా చెట్లలో కలిసి చెట్టుగా మారేవాడు గురువు. అల్లాంటప్పుడు నేను కలలు కాంచుతున్నానా? అనుకొనేవాడు సర్వమంగళుడు. చూస్తూండగా పడుకున్న గురువు మాయమై పోయేవాడు. మంచం భూమికంటి ఉండేదికాదు.

గురువు భోంచేయడం ఎన్నడూ చూడలేదు. తోటలో మూరు మూలకు వెళ్లి గురువు వికృతధ్వని చేసేవాడు; సర్వమంగళునికి భయం వేసేది. ఆయన అంతరిక్షందాకా పెరిగి వెంటనే మామూలుగా ఉండేవాడు. గురువుమంచం భూమికి తగలక పోవడం చూసి సర్వమంగళుడు అతను లేనప్పుడు మంచం క్రిందికి తగిలేటట్టు అణుద్దామని చూశాడు. మంచం తాకే సరికి గురువు నిద్రిస్తూ ప్రత్యక్షమయ్యాడు. అంతటితో ఆపని మానేశాడు సర్వమంగళుడు. ఈపనులన్నీ చూసి చూసి గురువుని "మీరల్లా అవుతారేమి"టని అడిగాడు. "యోగశాస్త్ర మహిమ అదంతా, నీకూ ముమ్ముందు తెలుస్తుందని" సమాధానపరిచాడు ఘనాపాఠి.

"రాత్రిళ్లు పీడకలలూ, మీతో చిత్రవిచిత్రలోకాలికి వెడుతూండడమూ, అక్కడ మీరు వికృతాకారుల్ని, సౌందర్యవంతుల్ని పిలిచి మాట్లాడడమూ, ఆలోకాల్లో నాటకాలు చూడడమూ, పర్వతశిఖరాలమీద మనం పరుగెత్తడమూ, పరుగెత్తి భయంతో నేను పడిపోతూంటే మీరు మోసుకుపోడమూ, ఇవన్నీ ప్రతిరోజూ నిద్రపట్టేసరికి జరుగుతున్నాయి. అప్పుడు నాప్రాణం ఉక్కిరి బిక్కిరి అవుతూంది." ఏమిటన్నాడు. "పైత్యాధికంవల్ల జరుగుతూంద"ల్లాగ ఇంక రావులే కలలూ ఏమీ, అన్నాడు గురువు. మహాత్ముల

మహిమా, దైవప్రభావమూ పరీక్షింపకూడదని ఊరు
కున్నాడు సర్వమంగళుడు.

౨

ఓరోజు తక్కువగా పన్నెండేళ్లూ గడిచాయి. చతుర్వేదములూ, వేదాంగములూ, కళలూ, గజకర్ణగోకర్ణవిద్యలూ, కాకీ, సమస్తవిద్యలూ క్షుణ్ణంగా అభ్యసించాడు సర్వమంగళుడు. హస్తాగ్రమందున్నాయి విద్యలన్నీని. గురువును మించిన విద్వాంసుడైనాడు. కళారహస్యాలు తెలుసుకొన్నాడు. ఇది చదువలేదూ, అది చదువలేదూ అన్న సందేహం లేదతనికి.

ఇన్నాళ్లకి సర్వమంగళునికి పట్నం చూద్దామనే కుతూహలం కలిగింది. పన్నెండేళ్లకి ఓరోజు తక్కువన్నమాట మరిచాడు. రహస్యంగా తోట పెరటిగుమ్మాన్ని వీథిలోపడి పట్నం చూస్తూ దశాశ్వమేధఘట్టానికి చేరుకొన్నాడు. అక్కడో వేపు పురాణకాలక్షేపం జరుగుతూంది. మరోప్రక్క అనేక వినోదాలు జరుగుతున్నాయి. వింతగా ఒక్కొక్కటే చూస్తూ పేరుపొందిన మహాపండితులు శాస్త్రవాదంలో కలహించుతూన్న స్థలానికి వచ్చాడు. నిదానించి చర్చా, విషయం తెలిసికొన్నాడు. ఆవాదనలో పాల్గొన్నాడు. వాదనలో క్రొత్తగా చేరిన సర్వమంగళుని వాదనానైపుణ్యం అందరినీ

ఆశ్చర్యంలో ముంచుతూంది. వాదానికి చోరబడిన సర్వమం గళుని జాగ్రత్తగా చూస్తున్నాడు మొదటినుంచీ దుంఠిశాస్త్రి. సంస్కృతం మూర్తీభవించినట్లు మాట్లాడుతున్నాడు సర్వ మంగళుడు. అక్కడున్న పండితుల వాదాలన్నిటినీ ఖండిం చాడు నిమిషంలో. అందరూ ఊరుకొన్నారు. తనసిద్ధాం తాన్ని స్థిరపరచాడు. తనసిద్ధాంతాన్ని ఖండించేశక్తి ఉంటే ఖండించవచ్చునన్నాడు. ఆమాట కెవ్వరూ జవాబివ్వలేదు. పండితులందరూ అతని పాండిత్యానికి మెచ్చుకొని గౌరవిం చారు. సభాపతి ఎక్కడ చదువుకొన్నావు అబ్బాయీ? అన్నాడు. ఈ ఊళ్లోనే ఘనాపాఠీగారి దగ్గర చదువుకొన్నా నన్నాడు వినయంతో. సభాపతి వింతదృష్టితో నోట మాట లేకుండా కూర్చుండి పోయాడు. సర్వమంగళుని కతనిస్థితి బోధపడలేదు. అంతలో సభలోంచి ఆ—ఆ—ఆ—ఆ...... ఘనాపాఠీ—బ్రహ్మరాక్షసి—దగ్గరటయ్యా చదువుకొన్నావు? ఎంతవింతా! అన్నమాటలు సభలో మారుమ్రోగాయి వొాఖ పెట్టున. భయంవేసింది సర్వమంగుళుని కామాటలు చెవిపడే టప్పటికి. చెవులు మూసుకొన్నాడు. ఏమిటీ?—ఆ—బ్రహ్మ రాక్షసా? మాగురువు? అని అనిఅని పడిపోయాడు సర్వ మంగళుడు. కూలపడిన సభాపతిని చేతులమీద తీసుకుపోయా రందరూ. అక్కడ ఒక పిట్టైనా లేదు. క్షణంక్రిందట అసం

ఖ్యాకజనంతో కలకలలాడుతూన్న ఆప్రదేశం ఘనాపాఠీ పే రుచ్చరించేసరికి చిటికెలో నిర్జనమైంది. పడిపోయిన సర్వమంగళుడు లేవలేదు. అల్లాగే పడిఉన్నాడా రాతిమీద.

చుక్కలాకాశాన్ని ఒక్కటొక్కటే అలంకరిస్తున్నాయి. విశ్వేశ్వరాలయంలోని ప్రదోషార్చనా ఘంటలు వినిపిస్తున్నాయి. సభలో సర్వమంగళుడు కాలుపెట్టిన దగ్గిరనుంచీ చూస్తూన్న దుంఠిశాస్త్రి వచ్చాడు. తారు పూసినట్టు చీకటంతటా నిండింది. సర్వమంగళుని సమీపించాడు దుంఠి. గంగాజలం చెంబుతో తెచ్చి సర్వమంగళుని మొహంమీద చల్లి తుడిచి కూర్చోపెట్టాడు. అతనికి కొద్దిగా తెలివివచ్చింది. గబగబా రెండుచెంబుల నీళ్లు తాగాడు. ప్రాణం గూట పడింది. ఏమిటండీ అందరూ పారిపోయ్యారన్నాడు. నీకోసం ఘనాపాఠీ వస్తాడన్న భయంవల్ల పారిపోయ్యారన్నాడు దుంఠి. ఘనాపాఠీ అంటే అందరికీ భయమే, ఎవరూ చాలతేరతనికి; నేనూ కొంతదూరం పరుగెత్తి ధైర్యం తెచ్చుకొని నీవేమైనావో అని వచ్చానన్నాడు. అయితే మాగురువులు బ్రహ్మరాక్షసేలా అయ్యారు? ఆయన మరణించారా? మీకు తెలిస్తే నిజం చెప్పండని ప్రార్థించాడు సర్వమంగళుడు. ఇక్కడుంటే ఘనాపాఠీ వస్తాడు. ఎప్పుడేనా వచ్చి మారు వేషంతో సభల్లో కూర్చోడం అలవాటుంది. విశ్వేశ్వరా

లయానికి పోదాం రమ్మన్నాడు. ఆలయానికి వెళ్లి ఏకాంతంగా కూర్చున్నారు. "పాతికేళ్లక్రిందట ఘనాపాఠీ కాలధర్మం పొందాడు. ముమ్మాటికీ కాలధర్మం పొందాడు. అతను మరణించడం భార్యా, పుత్రులూ, మిత్రులూ, బంధువులూ, పట్నంలో కవులూ, పండితులూ దగ్గిరుండే చూశారు. ఘనాపాఠీ మరణించి దూలానికి వేసిన మేకులా అయ్యాడు. సందేహమేమీ లేదు. అద్వైతమతాచారప్రకారం కటిక కట్టె మణికర్ణికాఘట్టానికి దహనానికి తీసుకువెళ్లారు. కాటికాపరి మరణించినట్లు రాసుకొన్నాడు. మోసినవాళ్లలో నేనొకణ్ణి. దహనం చేశారు. ఆకట్టె భస్మమై గంగలో కలిసిపోయింది.

ఘనాపాఠీకి యథాశాస్త్రంగా పన్నెండురోజులూ చేయవలసినకర్మ, ధర్మాలూ చేశారు. భార్య పూర్ణమ్మకి కేశఖండనం కూడా జరిగింది. పదమూడోనాటిరాత్రి ఎవరో ఘనాపాఠి ఇంటితలుపు తట్టారు. తలుపు తీసింది పూర్ణమ్మ. ఎదురుగా గుమ్మంలో ఊగుతూన్న కుండనాలూ, కాశ్మీరశాలువా, నుదుట అరచెయ్యంత ఎర్రనికుంకుమబొట్టూ, విశాలంగా ఎర్రగాఉన్న నేత్రాలూ, పింజలుపెట్టికట్టినధోవతీ, వీటన్నిటితో బ్రతికిఉండగా ఏవేషంతో ఉండేవాడో అల్లాగే ప్రత్యక్షమైనాడు ఘనాపాఠి. కళ్లారా అతన్ని చూసింది పూర్ణమ్మ. కెవ్వనకేకేసి కుమార్ళ్లని పిలిచింది. కుమార్ళ్లువచ్చి తండ్రినిచూస్తూ

దూరంగా నిలిచారు. అతనే తలుపు వేసుకొన్నాడు. "మీ కేమీ ఫరవాలేదు, మీ మానాన్ని మీరుండండి. నేనా తోటఇంట్లో ఉండాలనుకుంటూ తోటలోకి వెళ్లిపోయ్యాడు. అతనికైహిక వాంఛలూ లేవు, ఈషణలేదూ. తద్దినానికి భోక్తలుగా వాళ్ల బంధువులే వస్తారు. ఘనాపాఠీ ఆరోజున ఎక్కడా కనుపించడు. 'జ్ఞాని' అన్నాడు సర్వమంగళుడు. అతనెప్పుడూ ఇంట్లోకి వచ్చినట్టుకూడా చెప్పుకోలేదు. అందరూ పడుకున్న తరువాత వీధిలో తిరిగేవాడు. ఎవరికీ హాని చెయ్యలేదు. కాని అతని పేరు చెపితే మహాభయం వేస్తుందందరికీ. ఇప్పుడూ నాకు భయం వేస్తూంది. అతను ఇంట్లో ప్రవేశించిన రెండుమూడు రోజుల్లో ఘనాపాఠీ బ్రహ్మరాక్షసి అయ్యాడన్నమాట ఊరంతా అల్లుకుపోయింది. ఆవీధిలో మేడలూ, ఇళ్లూ కాళీ లయ్యాయి. అతను వచ్చినరోజురాత్రి మాట్లాడిన రెండుమాటలూ తప్ప మరెన్నడూ ఇంట్లో వాళ్లతో మాట్లాడినట్టు చెప్పుకోలేదు. మనుమలూ, మునిమనుమలూ తోట్లోకి వెడితే పిలిచి ఆడిస్తాడు. అతనింట్లో ప్రవేశించి నప్పటినుంచీ ఎవరూ తలనొప్పనేనా అనుకోలేదు. పూర్ణారోగ్యంగా ఉన్నారు. తన పిల్లలకి పిల్లలు కలిగినా, ఇంతవరకూ ఇల్లువిడువలేదు. పుట్టినవారంతా బాగున్నారు. ఐశ్వర్యంకూడా అల్లాగేవుంది. కుమాళ్లు ఉద్యోగాలు చేస్తున్నారు. రాత్రుళ్లు తలుపులు తీసిఉన్నా వాళ్లింటిలో చీపురు

పుడకేనాపోదు. ఊళ్లో ఎవరూ ఆయింటికి వెళ్లరు. ఆవీధిని పగ
లైనా తిరగరు.”

దుంఠి చెప్తూన్నంతసేపూ సర్వమంగళుడు తదేకధ్యా
నంతో వింటున్నాడు. ఎంతకాలం గడిచిందో వారికి తెలియ
లేదు. ఆలయద్వారాలు మూస్తూన్నచప్పుడువిని వెలుపలికి
వచ్చారు.

సర్వమంగళునికి గురువుచేసిన పనులొక్కొక్కటే జ్ఞాప
కానికివచ్చాయి. భయం అధికమైంది. ఇంటికివెళ్లడమా?
మానడమా? అన్నసందేహంపుట్టింది. వెళ్లకపోతే ఎక్కడున్నా
పట్టిబాధిస్తాడేమో అన్నభయం: పోనీ వెడదామంటే
ధైర్యం లేకుండాఉంది. అతనికేమీతోచలేదు. దాగట్లోపడిన
వెలక్కాయలాగ కొట్టుకొంటోంది మనస్సు. సలహా ఇచ్చే
వారేనాలేరు. ముందుకోఅడుగూ, వెనక్కోఅడుగూ వేస్తు
న్నాడు. రెండడుగులు వేసి నాలుగడుగులు వెనక్కివస్తున్నాడు.
దాగితే గురువుదృష్టికి కనిపించనా? అనుకున్నాడు. ప్రాణం
మీద ఆశవిడిచి ఇంతదూరంవచ్చిన నాకుభయమేమిటను
కొన్నాడు. గురువు చంపడానికిచూస్తే బ్రతిమాలుకొని చావు
తప్పించుకొందామనుకొన్నాడు. వినకపోతే? —అన్నప్రశ్న—
ఇంతవిద్యాదానంచేసిన గురువుకీపాంచభౌతికశరీరం కట్నంగా

అర్పించడం తప్పలేదనుకున్నాడు. శరీరానికే ఆయన ఆశిస్తే కావలసినదింకేమున్నదని సంతోషపడ్డాడు. కాని, ప్రాణాల మీద ఆశ లాగుతూంది. బ్రతుకుమీద ఆశ తెంపడానికి ప్రయత్నంచేస్తున్నాడు. తెగడంలేదు. ఎల్లాగో నడవలేక, నడవలేక ఇల్లు సమీపించాడు.

ద్వారగుమ్మం త్రోసిచూశాడు. గడియలు వేసిఉన్నాయి. పెరటిగుమ్మాన్ని ఎవరితోనూ మాట్లాడకుండా తిన్నగా తోటలో మందిరానికి వెళ్ళాడు. దీపందగ్గిర కళ్ళుమూసుకు కూర్చున్న గురువునిచూశాడు. ఇదివరకటికంటే సౌమ్యంగానే అవుపించాడు. మధ్యమధ్య వికృతాకారంగా కూడా కనుపిస్తున్నాడు. గురువుకన్నులు విప్పిచూసేటప్పటికి నిలువునా కూలిపడ్డాడు సర్వమంగళుడు. "నాయనా! ఎక్కడికి వెళ్ళావింత రాత్రిదాకా? భయపడుతున్నావేమి?" అన్నాడు ఘనాపాఠి. "ఆ మాటలు వినగానే ఏడవడంప్రారంభించాడు సర్వమంగళుడు. "నిన్నేమీ అనను. నీవెక్కడికి వెళ్ళావో, ఏమిచేశావో అంతానాకు తెలుసు. నీవేమీ చెప్పనవసరంలేదు. ఏమీఅనకుండానే అల్లావూరికే భయపడతావెందుకు? నీకువచ్చేప్రమాదమేమీలేదు. ఏడవకు. భయపడకు. ఈరాత్రితో పన్నెండేళ్ళూ పూర్తిఅవుతాయి. ఈవేళ నీకో రహస్యమంత్రం ఉపదేశిద్దామనుకొన్నాను. దానివల్ల భూతభవిష్యద్వర్తమానాలలో

జరిగేసంగతులు తెలియడమేకాదు, ఇంకాఎన్నో ఉపకారాలు జరుగును. ఇక ఉపదేశించినా లాభంలేదన్నాడు.

బ్రతికిఉండగా నాకొచ్చిన విద్యలెవ్వరికీ చెప్పకపోవడం వల్ల ఈ జన్మవచ్చింది. ఈ విధంగా నీకు విద్యాదానం చెయ్య డంచేత నాకు ముక్తికూడాఇప్పుడే అంటూ భగ్గునమండి మాయమైనాడు ఘనాపాఠి." కెవ్వున కేకవేసి ఏడుస్తూ ఇంట్లోపడ్డాడు సర్వమంగళుడు.

# పిడకలమల్లుభొట్టు

## ౨

కాశీనుండి రామేశ్వరం, రామేశ్వరంనుండి కాశీకీ పోయే పెద్దరహదారి. ఆదారిమధ్య ముసలి మర్రిచెట్టు. ఆచెట్టు ఎన్ని వేలేళ్లనుంచి ఉందో ఎవరికీ తెలియదు. కొమ్మలు మైళ్లకొలదీ వ్యాపించి ఉన్నాయి. భూమిక్రిందికి దిగిపోకుండా ఉండడానికి బిగించినట్లూడలు లెఖలేనన్ని పెరిగిఉన్నాయి. అక్కడ కనుచూపుమేర కీకారణ్యం. రకరకాలవృక్షాలూ, తీగెలూ, ఎత్తుగా పెరిగిన గడ్డీ ఆకాశాన్నంటేటట్టుండి చీమదూరడానికేనా సందులేకుండా వుంది. అనంతకోటి ఘాతుకమృగాలికి పుట్టిన ఇల్లూ ఆఅడవి. పర్వతాల్లావున్న ఏనుగుల్ని మ్రింగే పాములున్నాయి. పక్షిజాతులన్నిటికీ ఆచెట్టునికిపట్టుగాఉంది, పరిమితి లేదు. అల్లాంటిదారిని యాత్రాపరాయణులు వందలకొలదీ బండ్లమీద ప్రయాణిస్తూఉండేవారు క్రూరమృగాలికి భయపడి. కాని చిరకాలమై అమలులోవున్నట్టాదారి కనిపించడం లేదు. కారణం?

# పి డ క ల మ ల్లు భొ ట్టు

దారితప్పిన పండితుడు కన్నూమిన్నూ కనపడని చీకటిలో అర్థరాత్రి ఆమ్రక్రిందికి చేరాడు. నడకబడలికా, ఒడలుమరచే నిద్రవచ్చింది. పడుకున్నాడు. మహావృక్షం సమూలంగా వొకసారి కదిలింది. ఆచప్పుడికి కలల్లేని నిద్రలో ఉన్న పండితుడు తుళ్లిపడి కళ్లువిప్పాడు. ఎవ్వరూ కనిపించలేదు. తిరిగి కన్ను మూశాడు. చెట్టుమళ్లీ కదిలింది. పెద్దకంఠంతో "ఆ, కా, మా, వై కోనుస్నాతః" ? (ఆషాఢ, కార్తీక, మాఘ, వైశాఖ మాస పౌర్ణమీ తిథులలో ఎవ్వడు తెల్లవారుఝామున స్నానముచేసెను ? ) అని కెవ్వున కేకవినిపించింది పండితుడికి. భయంతో వణుకుతూ లేచి నుంచున్నాడు. చిమ్మెటలధ్వనీ, పాముల బుస్సూ, నక్కల ఓలలూ, వ్యాఘ్రాదుల పెనుబొబ్బలూ, పక్షులకలకలం, వల్లా చెవులు చిల్లులుపడుతున్నాయి. తేరిపారి చూశాడు. చుట్టూ కారడవి. పారిపోవడానికి చూశాడతను. గట్టిగా ఆమాటే మళ్లీవినిపించింది. బాగావిన్నాడు. మృగాలు పరుగెత్తుతున్నాయి. పక్షులు ఎగిరిపోతున్నాయి. చెట్లువిరిగి పడుతూన్నధ్వనులు వినిపిస్తున్నాయి. ఎటువెడితే ఏమో? అని చెట్టుమూలానికి పరుగెత్తి తొర్రలోదాగున్నాడు. "ఆ, కా, మావై కోనుస్నాతః ?" అన్న కేకలు మితిమీరివస్తున్నాయి. అడవి ప్రతిధ్వనిస్తూందా కేకలకి. మనిషిమాటల్లావున్నాయి. మనిషిమాటకు కొంతభిన్నంగా ఉన్నాయి ఆలోచిస్తే.

మనిషా? ఎవరో? తెలియలేదు. కేకలుతప్ప ఎవరూ కనిపించరు. మనిషే అయితే ఇంతకంఠం ఏమి? టనుకొన్నాడతను. ఎవరైతేనేమి, సమాధానం ఇద్దామని నిశ్చయించుకొన్నాడు. భీకరంగా పైమాటవినిపించింది. "అహంసుస్నాతః" (నేను బాగాస్నానంచేశాను) అని భయంతో గట్టిగా జవాబిచ్చాడు. భయంకరమైన బ్రహ్మరాక్షసి చీకటికొండలాగ ప్రత్యక్షమై పండితునిపాదాలమీద పడ్డాడు. ఆరూపం చూడలేకపోయాడతను. జవాబు ఎందుకిచ్చానా? అనుకొన్నాడు. అతనికి ప్రాణాలమీద ఆశపోయింది. ఏమీతోచలేదు. ప్రతిమలా నిలిచిపోయాడు. "మహాత్మా! ఏవూరు వెళుతూ ఇక్కడికి వచ్చారన్నాడు బ్రహ్మరాక్షసి." "దత్తాత్రేయభగవానుని దర్శనానికి—కాశీ వెళుతున్నా" నన్నాడు వచ్చీరానిమాటలతో. "ఆలోచించి నిజమేనా?" అన్నాడు. "ముమ్మాటికీ సత్యం, గాయత్రీసాక్షిగా—అబద్ధమేమీలేదు. నీవెవ్వరు? నీవృత్తాంతమేమిటి? నన్నిలా భయపెట్టడానికి కారణమేమిటి? నీకేమి అపకారంచేశాను?" అన్నాడు పండితుడు. "మహాత్మా! మీరేఅపకారమూ చేయలేదునాకు. మీరుమిక్కిలి ఉపకారమేచేశారు. మిమ్మల్ని భయపెట్టడానికి రాలేదునేను. క్షమించండి. ఇందాకటి ప్రశ్ననాదే. ప్రశ్నకు ఇన్నాళ్ళకి జవాబు వచ్చిందన్న ఆనందాన్నిపొంది వచ్చాను. పూర్వస్మృతిబాగా

కలిగింది. నా సంగతి వినండి—భయపడకండి. ఇంతకీ పూర్వ జన్మకర్మ పరిపాకమిదీ—"

"రాజకుమారికి గ్రహం పట్టింది. అప్పటికామె వయస్సు ఇరవై సంవత్సరాలు. చాలా రూపసి. గుణవంతురాలు. వివాహం కాలేదు. ఆపట్టిన గ్రహం పురుషగ్రహమనికొందరు. స్త్రీ గ్రహమనికొందరు. అదీకా దిదీకాదు నపుంసక గ్రహమని కొందరు. మామూలుదయ్యమే అని కొందరు. పీడనీ, పిశాచమనీ, కామినీభూతమనీ, బేతాళమనీ, కాదు బ్రహ్మరాక్షసనీ, శాకినీ, ఢాకినీ జాతిలోనిదనీ ఇల్లా ఎవళ్లకితోచినట్లు వాళ్లనే వాళ్లు.

తుదకా గ్రహమేదో స్థిరపడలేదు. గ్రహం రాజకుమారిని రోజూ కాశీకి ప్రొద్దుటే తీసుకుపోయి గంగాస్నానం చేయించి గంటలో తీసుకువచ్చేది. దాఖలాకోసం అన్నపూర్ణాదేవి మెడలో హార మొకట వేసి తీసుకువచ్చేది ఒక్కొక్కమారు. పరివారం చూస్తూండగా దేవలోకంలో దివ్యపుష్పాలు ఆమె జడలో పెట్టేది. కనులు మిరుమిట్లు గొలిపే రత్నాభరణాలలంకరించేది. రాత్రిళ్లు ఇనుపతలుపులు గల గదిలో వుంచి సీళ్లువేసి రక్షకభటుల్ని పెట్టినా తలుపులూ, పైకప్పూ విప్పకుండా ఆ పిల్లని తీసుకుపోయేది. వొకొక్కప్పుడు నెలా, రెణ్ణెల్లదాకా ఆపిల్లని ఇంటికి తీసుకువచ్చేది కాదు. 'ఎక్కడికి

వెళ్లావ 'ని అడిగితే స్వర్గంలో శచీదేవితో నాటకాలు చూస్తు న్నా నామెతో అనేది. మరొక్కప్పుడు సరస్వతీదేవికి అతిథి నిగా ఉన్నా ననేది. మరోనాటి అపూర్వమూ, ఆనందమూ అయిన లోకాలు చూశా ననేది. ఇంకోమారు కేవలం ప్రణయ జీవుల స్వేచ్ఛాలోకం వెళ్లేనని పొంగుతూ మాట్లాడేది. అప్పటి కప్పుడే తిరిగి భయంకరమైన భూతప్రేతపిశాచాదిలోకాలు చూశానని భయంతో దగ్గిరున్నవాళ్లని గట్టిగా కౌగలించు కొని ఏడ్చేది. చాలా సేపు ఏడవడం మానేదికాదు. ఆ ఏడుపు వింటే గుండె తరుక్కుపోయేది. ఆగ్రహాన్ని తిడితే రాజ కుమారిని ఏపాడింటిలోనో, పాడునూతిలోనో కూర్చోపెట్టేది. ఇంకా ఇలాంటి చిత్రవిచిత్రాలు చేస్తూ ఉండేది.

నానాటికి కుమార్తె కష్టాలు మితిమీరుతున్నాయి. కష్టాలు చూస్తూన్న తలిదండ్రులికి బెంగ పెరుగుతూంది. గ్రహ మెల్లా పోతుందో వారికి తెలియలేదు. సర్వప్రయత్నాలూ చేసి చూశారు. గ్రహం పోయే సూత్రం దొరకలేదు. కొన్నేళ్లు గడిచాయి. ఓనాడు భూతవైద్యుడు రాజాస్థానంలో ప్రవేశించి విచారిస్తూన్న రాజును చూసి కారణం తెలిసికొన్నాడు. "పుట్టెడు నువ్వులు రాశిగా పోసి కత్తి చేతిలో ఎత్తి పట్టు కొన్నట్లు మనిషిపొడుగు బంగారం బొమ్మ చేయించి ఆనువ్వుల రాశిలో మధ్యగా పైకి కనిపించేటట్లు పెట్టి, ఎన్నడూ దానం

పట్టని బ్రాహ్మణునకా రాశి దానం చేస్తే గ్రహమోక్షణంలో విడిచి పారిపోతుం" దని చెప్పాడు. వెంటనే ఆ ప్రయత్నం చేసి బ్రాహ్మణుల్ని పిలిచి 'దానం ఎవరు పడతారు?' అని అడిగాడు రాజు. ఆపని కెవ్వరూ సాహసించలేదు. అందరూ దానాలు పట్టి చేతులు కాల్చుకొన్నారు కనక మొహామొహాలు చూసుకోడం వచ్చింది. అంత బ్రాహ్మణ్యంలోంచీ ముసలాయన లేచాడు. శతవృద్ధు. లేచి, ఏమన్నాడూ? ఉండుండు చెపుతా— తర్వాత?—జ్ఞాపకానికి రావడంలేదు— ఆ — ఊ—ఏమన్నాడు చెప్మా?—అబ్బా!—మరుపొచ్చింది— ఆ—అహ్హాహ్హా—అదీ!—"మన పట్నానికి సమీపారణ్యంలో "మల్లుభొట్ట" ని—అహ్హాహ్హా—బ్రహ్మచారి ఉన్నాడు. అతను ఏరుపిడకలమ్ముకొని జీవిస్తూండడంచేత 'పిడకల మల్లుభొట్లు' అంటారు. అహ్హాహ్హా—ఆయన గాయత్రీతపస్సు చేస్తున్నాడు. ఈ దానం పరిగ్రహించడానికి ఆయనొక్కడే సమర్థు" డని చెప్పాడు. ఆ 'పిడకల మల్లుభొట్లు'—అహ్హాహ్హా—ఎవరు? నేనే. అహ్హాహ్హా—

కాలినడకని ఆ మహారాజొక్కడే నాదగ్గిరికి వచ్చాడు. దానం పట్టమని ప్రార్థించాడు. రాజు పురోభివృద్ధి అత్యంతావసరం, కర్తవ్యమూను కాబట్టి దానం పట్టాలి. తప్పదు.— అహ్హాహ్హా—'ఇదిగో! నవ్వకుండా మాట చెప్పు' అన్నాడు

పండితుడు. ఆ దానం పట్టినందువల్ల వచ్చే దోషం ఏమిటో బాగా ఆలోచించి, దానం పట్టిన తర్వాత తెల్లవారకుండా సేతువులో స్నానం చేయాలి. అల్లాగ స్నానం చేయకపోతే ప్రతిగ్రహదోషంవల్ల బ్రహ్మరాక్షసినై పోతాను. అంచేత స్నానం ఏర్పాటు చేస్తే దానం పడతానన్నాను. అంగీకరించారు రాజు.

ఉషఃకాలానికి పూర్వమే మేల్కొన్నాను. కాల్యకృత్యాలు తీర్చుకొని నియతతపస్సు చేశాను. సూర్యుప్రొద్దెక్కింది. వ శుద్ధాత్ముణ్ణై వెళ్ళి దానం పట్టాను. చెయ్యి చిల్లుపడేటట్టు. రాజకుమార్ని వెంటనే ఆ గ్రహం విడిచింది. ఎదురుగా ఉన్న పెద్ద మేడ కూలిపోసి భగ్గున మండి మాయమైంది. అక్కడున్న వాళ్ళు నిర్ఘాంతపడి చిత్తరువుల్లా అయ్యారు. బలంగా వున్న రాజపుత్రి బలంలేనిదైంది. మూర్ఛపడింది.

నువ్వులరాశి తీసుకోడానికి సమీపించాను. అందులో వున్న బంగారువిగ్రహం నన్ను నరకడానికి చెయ్యి ఎత్తింది. గాయత్రీజపఫలం కొంత ధారపోశాను. అల్లాగ రెండుమూడు మార్లు జరిగింది. చంపడానికి చెయ్యి ఎత్తినప్పుడల్లా జపఫలం ధారపోశాను. దానితో ఆ ప్రతిమ ఊరుకొంది. నువ్వులూ, బంగారం అక్కడున్న బ్రాహ్మణ్యానికి పంచిపెట్టమని సేతు స్నానానికి బేగిరావులమీద బయలుదేరాను.

# పిడకల మల్లు భొట్టు

ఎడతెగని ప్రయాణం. తొలికోడి కూసింది. ఇహ అక్కడికో మజిలీ వుంది. దాటలేనన్న ఆందోళన పుట్టింది. మజిలీ సగం దాటాను. మలికోడి కూసింది. తలనొప్పి, వికారమూ, కళ్లు చీకట్లుక్రమ్మడమూ, ఒళ్లు బరువూ, ఆపాదమస్తకమూ మంటా, కంఠధ్వని మారడమూ, మరుపూ చెరుపూ, స్మృతి తప్పడమూ ప్రారంభమయ్యాయి. నాలుగు దిక్కులనుంచీ కోడికూతలు వినిపించాయి. ముఖం పెద్దదైంది. తలవెంట్రుకలు ఈతరుప్పలా అయ్యాయి. కాళ్లూ, చేతులూ, పొడుగ్గా, లావుగా పెరిగిపోయి బరువెక్కాయి. పళ్లు పైకొచ్చాయి. కోరలు మొనగెక్కాయి. తుదకి శరీరం ఇల్లా పెరిగిపోయింది. ఆకలి ఎరగని నాకు బ్రహ్మాండాన్ని మ్రింగేసేటంత ఆకలి వేసింది. దప్పి పుట్టింది. మజిలీ పూర్తికావొచ్చింది. తెల్లవారింది. పులుగులకూత ఒక్కసారి మ్రోగాయి. బ్రహ్మరాక్షసినైపోయాను—

తాళలేనం తాకలివేసింది. ఎక్కిన వాహనాన్ని విర్చుకు తిన్నాను. ఆకలి తీరిందికాదు. పల్లెలమీద పడ్డాను. చేతికి అందినవాళ్లని విర్చుకొని తిన్నాను. ఆరక్తం వంటినిండా పూసుకొనేవాణ్ణి. పేగులు తలకీ, మొలకీ చుట్టుకొనేవాణ్ణి. బ్రహ్మరాక్షసి ఊళ్లమీదపడి జనాన్నీ, జంతువుల్నీ తింటోం

# దయ్యాలు

దని నిమిషంలో ప్రతీ గ్రామానికీ వార్తలు ప్రాకాయి. ఊళ్ళు విడిచి పారిపోయారు జనులు. చాలా గ్రామాలు పాడు పడిపోయాయి. కొంతకాలానికి జనుల్నీ, జంతువుల్నీ చంపి తినడం అసహ్యం వేసింది నాలోనాకే. ఆపని మానేశాను. కాని పూర్తిగా మానలేదు. దానం పట్టడం పరోపకారం కానందుచేత పూర్వస్మృతి ఎప్పుడేనా ఉండేది.

తిరిగి తిరిగి ఈమ్రి నివాసంగా ఉన్నాను. "ఆ,కా,మా, వైకోనున్నాతః?" అని మూడుమార్లే అడిగేవాణ్ణి. ఎవ్వరూ సమాధానం చెప్పలేదు. ఆయాతిథుల్లో స్నానంచేసినవారు ఆత్రేయభగవానుని దర్శించడానికి అర్హులనీ, వారు భగవానునికి నాస్థితిచెపితే ఈజన్మపోతుందనీ అడిగేవాణ్ణి. సమాధానం చెప్పకపోతే ప్రాణంవిసిగి జనాన్ని చంపేసేవాణ్ణి. సమాధానం చెప్పినవారికి భగవానుని సులువుగాపోల్చుకొనే మార్గం తెలుపుదామని కూడా అనుకొన్నాను. ఇంతవరకూ సమాధానం వస్తేకదూ. నేనిక్కడున్నానన్న సంగతి దేశమంతా వ్యాపించింది కొన్నాళ్లకి. అంచేత ఈ దారికట్టుపడింది. ఏంచేయమన్నావు జన్మ అల్లాంటిది ప్రాప్తించింది. ఇన్నాళ్లకి నీవొక్కడవు కనిపించావు. నాపుణ్యం ఫలించిందీవేళ.

అకారణంగా నీమం విడిచి ఎందుకల్లా ప్రశ్నించానో తెలియదు. చాలా దూరంనుండి వచ్చాను కూడాను. నాకీజన్మ పోగొట్టి ముక్తిచ్చే సామర్థ్యం వొఖ దత్తాత్రేయులకే ఉంది. ఆయన కల్లుకీతకి వెళ్లే ఏతవాడి మోస్తరుగా ఉంటాడు. నిజస్వరూపం ఎవరికీ గోచరించదు. ఏతవాళ్లందరికీ ఒయిదుమెట్ల నిచ్చెనలుంటే ఆయన కారుమెట్ల నిచ్చెనఉంటుంది. ఆ ఆరూ ఆరుశాస్త్రాలు. ఏతవాళ్లదగ్గిర ఒకటీ రెండూ కుక్కలుంటే ఆయనదగ్గిర నాలుగు కుక్కలుంటాయి. ఆనాలుగూ నాలుగు వేదాలు. ఏతవాళ్లు నడిచేదారిలో ఊకపోస్తే వాళ్లు త్రొక్కుకుపోతారు. ఆయన వేసినవారిని తిడుతూ ప్రక్కనుంచి నడుస్తాడు. ఊకత్రొక్కడు. ఆయనే భగవానులని తెలుసుకోవచ్చును." అని తన జన్మవృత్తాంతమూ, భగవానుని తెలుసుకొనే గుర్తులూచెప్పి తలవొంచి ఊరుకొన్నాడు బ్రహ్మరాక్షసి.

నిశ్చలంగా, వింతగా ఆవృత్తాంతం వింటూన్న పండితుడు తొర్రలోంచి పైకి వచ్చాడు. భయంపోయింది. బ్రహ్మరాక్షసిని సమీపించి నుంచున్నాడు. భగవానునికి నామాటచెపితే ముక్తి పొందుతాను. ముక్తికి మరోదారిలేదు. ఆయన కీమర్రిమీద మల్లుభొట్లున్నాడని చెప్పుమని కన్నీళ్లు విడుస్తూ తల

యెత్తి, చేతులెత్తి ప్రార్థించాడు బ్రహ్మరాక్షసి. భగవానుల కీ విషయం చెప్పుతాను; దుఃఖించకంటూ వాగ్దాన మిచ్చాడు పండితుడు. అత్యంతమైత్రి కుదిరింది మల్లుభొట్లుకీ పండితుడికీని. తెల్లవారుతోంది. మృగభయంలేకుండా పండితుణ్ణి నెత్తి మీద ఎక్కించుకొని మహారణ్యం దాటించాడు బ్రహ్మరాక్షసి.

అప్పటినుండీ బ్రహ్మరాక్షసి భయంపోయింది. క్రూరమృగాల భయమూలేదు. ఆబాట నిరాఘాటంగా సాగుతోంది.

# బొమ్మలాట

## 3

శీతాకాలం. చలి అపరిమితంగా ఉంది. ఆ రోజుల్లో బొమ్మలాట వాళ్లు కొల్లేరుపై గ్రామాలకి ప్రదర్శనాల నిమిత్తం వెళ్లారు. అక్కడక్కడ చాలా ప్రదర్శనాలు చేశారు. ఆయా నగరాల వాళ్లచేత శాభాష్ అనిపించుకొన్నారు. విరివిగా కట్నాలూ, కానుకలూ పుచ్చుకొన్నారు. ప్రతి సంవత్సరం కంటే ఆ సంవత్సరం వారికి చాలా ధనం దొరికింది. స్వగ్రామానికి మళ్లు మొహం పట్టారు.

ప్రయాణాలమీద రాగా రాగా కొల్లేరు దగ్గిరికి వచ్చేసరికి చీకటిపడింది. కన్నూ మిన్నూ కనపడ్డం లేదు. సామాను గుర్రాలు ముందుకి సాగడం లేదు. బలవంతంగా గుర్రాల్ని తోలుతున్నారు. దెబ్బలుతిని గుర్రాలు సకిలించి ఎగరడమే కాని ముందుకి కాలు పెట్టడం లేదు. వడవడా వణుకుతున్నాయి. దోమలూ రికే పొడుస్తున్నాయి. కనుచూపు మేర నిర్జన ప్రదేశం, జలమయం. జమ్మూ, రెల్లూ, తాడీ మొదలైనవాటితో ఆ నీటి ప్రదేశం జీబుమంటోంది. నీటి మీద నాచు పట్టి ఉండడంచేత

# దయ్యాలు

ఎక్కడ మెరకస్థలమో, ఎక్కడ నీరు స్థలమో తెలియడం లేదు. ఆ చీకట్లో గుర్రాలికేమి కనపడుతుంది? జమ్ము దుబ్బుల్లోంచీ, నీటిలోంచీ రకరకాల పిట్టకూతలు వినిపిస్తున్నాయి. కొంగల గొంగొంగురధ్వని హెచ్చుగావుంది. బొమ్మలాటగాళ్ళందరూ మొత్తం పాతికమందిదాకా ఉన్నారు. చెట్టూ, చేమా వారికి సమీపంలో కనిపించడంలేదు. వారికేమీ పాలుపోవడంలేదు. మంచు ఎడారిలో పడినట్టుంది వారికి. క్రమేపీ కాటుకపూసినట్లుయింది చీకటి. నక్కకూతలచేత చెవులు బ్రద్దలైపోతున్నాయి. గుండెల్లో దిగులుపుట్టిస్తున్నాయి ఓలలు. పెద్దనక్కలూ, గుంటనక్కలూ, వరళ్లూ వారి సమీపంలోంచే పరుగెత్తుతున్నాయి. చలిగాలి రొజ్జగావీస్తోంది. ఆకలిచేత ఎడపిల్లలూ, చంటిపిల్లలూ, ఏడుస్తున్నారు. దగ్గరగా పల్లేదేనా ఉందేమో అని కాలివేళ్లమీద నిలిచి చూస్తున్నారు. అందులో ఏపుగాఉన్న ఒకడు ధైర్యంచేసి ఓ చెట్టుమీదికెక్కి నాల్గుదిక్కులూ పరిశీలించి చూశాడు. చూడగా చూడగా విద్యుద్దీపాల్లా ప్రకాశిస్తోన్న దీపాలతో, మహాసౌధాలతో పెద్దనగరం మైలు దూరంలో తాటితోపు వెనక కనిపించింది. పరమానంద భరితులయ్యారు. ఆటగాళ్లా నగరంవేపు నడిచారు. అతికష్టం మీద నగరం చేరారు.

# బొమ్మలాట

ఆ నగరవీథులు సూత్రంపట్టినట్లున్నాయి. ఇప్పటినగరాల కేమాత్రం తీసిపోవటంలేదు. ప్రతీఇంట్లోనూ వేద ఘోష, శాస్త్రచర్చలే. భార్యాపిల్లలతో బంగారు తూగుటుయ్యాలల్లో వూగుతున్నారు ప్రతీఅవధానీ, శాస్త్రుర్లున్నూ. అన్నిఇళ్లూ బ్రాహ్మణులవే. రెండోవర్ణంలేదు. ప్రతీమేడా ఆకాశాన్నం టుతోంది. ధనంతో, అందమైనస్త్రీలతో కిలకిలలాడుతోంది నగరం. రాజమార్గంప్రవేశించారు ఒక బొమ్మలాటవాళ్లు. వస్తోన్నఆటగాళ్లకి ఆహ్వానమిచ్చారు బ్రాహ్మణులు. వారికి భోజనసదుపాయాలు చేశారు.

సుష్టుగావాళ్లు భోంచేసిన తరువాత వాకాకేం దేనా ఆనుకున్నారు పౌరులు. నిర్ణయధనం ముందేఇచ్చారు. ఆటకోసం నిమిషాలమీద పందిరీపాకా తయారుచేశారు. ఆనదందీపాలు వగైరా తయారయ్యాయి. ఆటగాళ్లు ఎక్కడుండవలసిన సామానులు అక్కడవుంచారు. తమలోతామాలోచించుకొని లంకాదహనం ఆడడానికి నిశ్చయించారాటగాళ్లు.

వెనకా, ముందూ మడతలుతీర్చికట్టిన పంచికట్టులతో, చెవులకి కుండనాలతో, సింహతలాట మురుగులతో, గోష్పాదమంత పిలకజుత్తులతో, మొహంమీదా, గుండెలమీదా, చేతులమీదా, కడుపునాపెట్టిన విభూతిరేకలతో రుద్రగణాల్లాగ పట్నంలోనివారందరూ వాకేమోస్తరుగా సభకు

వచ్చారు. ఆభరణాలతో, నొసట అరచెయ్యంత కుంకుమ బొట్లులతో స్త్రీలు సభనలంకరించారు. మొత్తంరెండు మూడు వందలమంది కూర్చున్నారు ఆట చూడ్డానికి. ఆటగా ళ్లతిఉత్సాహంగా ఉన్నారు. ఆటబొమ్మలుకొన్ని తెరపై కెక్కాయి.

ముందుగా గణపతిప్రార్థనా, పూజా జరిగింది. గడేల్న కొబ్బరికాయ కొట్టారు. తరువాత భయంకరాకారంతో, పెద్ద పెద్దగొంతులతో పాటలుపాడుతూఉండగా ఆంజనేయుని విగ్రహం తెరెక్కింది.

బొమ్మరావడమేతడవుగా సభమాయమైంది. దీపాలూ లేవు, సభాలేదు. దీపాలన్నీ వొకసారే ఆరిపోయాయేమా? అనుకొన్నారు ఆటగాళ్లు. తెరమీది ఆంజనేయుని విగ్రహం తీశారు. సభా, దీపాలూ యథాప్రకారంగా వచ్చాయి. సభ నిశ్శబ్దంగావుంది. సూదిపడితే వినుపిస్తుంది. "ఏంబాబయ్యా! దీపాలారిపోయాయి?" అన్నారు. సభలోంచి జబాబులేదు. సభచిత్రించినట్లుంది. చలనంలేదు. సభికులు కనురెప్పవేసి నట్టూలేదు. మళ్లీహనుమానుని విగ్రహంవేశారు. సభా, దీపాలూ, పందిరా మాయమైనాయి. విగ్రహంతీశారు. సభ మామూలుగా తయారయింది. ఆటగాళ్లకి అనుమానం. ఎంచేతఇలా అవుతోందా? అనికొంత సేపాలోచించారు. స్వంత

దీపాలు వెలిగించుకొన్నారు. బొమ్మతీస్తే సభవుండడమూ, వేస్తే మాయమవ్వడమూ పదిపన్నెండుసార్లు కనిపెట్టారు. వాళ్ల దీపాలుమాత్రం వెలుగుతున్నాయి. ఏమిటీచిత్రం ? వాళ్లకేమీ అర్థంకావడంలేదు. ఇదేదో ఇంద్రజాలమా? స్వప్నమా? అనుకొన్నారు. వారిలోపెద్ద తెరముందుకి వచ్చి సభవారిని ప్రశ్నించాడు. జవాబులేదుసరికదా! సభలోనిపెద్దలు వికృతాకారంగా గ్రుడ్లెర్రచేసి తన్నుచంపుతారా అన్నంతభీకరంగా కనిపించారు. అతనిప్రాణాలు నిలువునా ఎగిరిపోయినట్లయింది. తిరిగి తెరలోనికి వెళ్లలేకపోయాడు. కాళ్లువణుకుతున్నాయి. మెల్లగా తెరలోకి నడుస్తూన్నట్లు కనిపించకుండా సభచూస్తూ లోపలికివెళ్లిపడ్డాడు. హమ్మయ్యా! బ్రతికానన్నాడు. గుండెలు రాళ్లగాచేసుకొని ఆంజనేయుని విగ్రహం తెరమీదే ఉంచి పాడుకొంటూ కొనఊపిరితో కూర్చున్నారు.

తెల్లవారింది. అంతాబంగసబయలూ. చుట్టూనీటిమయం. వాళ్లున్నస్థలంకాస్తామెరక. పాకకూడా తెల్లారేసరికి మాయమైంది. ఎవరికీ ప్రాణాపాయం రాలేదు. అతికష్టంమీద ఆదిబ్బ దాటి బయటపడ్డారు. గుర్రాలునిలవకుండా తోలుకొంటూ తొందరగా ఆ ప్రదేశాలు దాటారు. కనపడినవాళ్లకీ సంగతి చెప్తూ ప్రయాణించారు. విన్నవాళ్లు అవి దయ్యాలే సందేహంలేదన్నారు.

# కామిని

## ౧

చాలాకాలం క్రిందట. అంటే ఓవ్వూరునుండి ఓవ్వూరు వెళ్లాలంటే బండివెళ్లడానికి దారిలేక కాలినడకని వెళ్లేరోజులు. అప్పుడు 'రోడ్లు' అన్నమాటే పుట్టలేదు. పదిమందీ నడిచే దారిపట్టి వెళ్లాలి. అల్లాంటిదారిని పదిమంది జట్టుగా కలిసి వెళ్లేవారు. సాహసించి ఒంటరిగా ఎవ్వడూ వెళ్లేవాడుకాడు.

కోనసీమవారు రెడ్డిసీమా, పల్నాటిసీమా, జల్లిసీమా, వెళ్లాలన్నా, రెడ్డిసీమలవారు కోనసీమ వెళ్లాలన్నా మధ్య గంభీరంగా ప్రవహించే గోదావరి దాటాలి. కోనసీమకి ఎల్లా వెళ్లాలన్నా గోదావరి దాటకతప్పదు. గోదావరి వర్షాకాలంలో ఒక్కొక్కదగ్గిర నాలుగైదు మైళ్లు వెడల్పుకలిగి పారుతూ వుంటుంది. గోదావరి నిండా పారే రోజుల్లో దుర్నిరీక్ష్యం. మధ్యమధ్య వున్న లంకభూముల్ని గర్భంలో దాచుకొంటుంది. ఆ మహాప్రవాహం చూస్తే కళ్లు తిరుగుతాయి. మామోలు రోజుల్లో గోదావరి పాయలక్రింద చీలిపోయి పారుతూ వుంటుంది. ఒక్కొక్కదగ్గిర ఒకే పాయక్రింద ప్రవహిస్తుంది.

కొన్నిపాయల్లో దిగి నడవొచ్చు. కొన్నిపాయలు పడవమీద గాని దాటలేము. గోదావరీ తీరాలు జమ్మూ, రెల్లూ దుబ్బు లతో దట్టంగా నిండివుంటాయి. మధ్యమధ్య మహావృక్షాలు కూడా వున్నాయి. ఆదుబ్బుల్లో జంతువులున్నా తెలుసు కోవడం కష్టం. ఒడ్డు లతివరకంగా వుంటాయి.

ఏటిగట్టు ఇవతల దగ్గిర దగ్గిరగా దూరదూరంగా వూళ్లు న్నాయి. కొన్నివూళ్లు పట్నాల్లా కూడా వున్నాయి. ఆవూళ్లు పాడిపంటలతో ధన ధాన్యాలతో లక్ష్మీప్రదంగా వుంటాయి. ప్రతీ గ్రామానికీ సాధారణంగా గోదావరి దాటి లంకల్లోకి వెళ్లడానికీ నీళ్లు తెచ్చుకోడానికీ రేవు లుంటాయి. ఆ రేవుల సమీపంగానే శ్మశానాలుంటాయి. సర్వమతాలవారికీ వొకటే శ్మశానం. దహన ఖననాలు అక్కడే జరుగుతాయి.

ఆ రేవుల్లో కోడేరు రేవు పెద్దది. పురాతనమైన దంటారు. కోనసీమ వెళ్లేవాళ్లు సామాన్యంగా రేవు అక్కడే దాటుతారు. చుట్టుపక్కల చాలా పల్లెలున్నాయి. అన్నివూళ్లకీ శ్మశాన మక్కడే. శ్మశానం కొలదిదూరంలో దట్టంగా పెరిగిన దుబ్బుల్లో వుంది. అక్కడ దహనాదులుచేసి రేవులో స్నానం చేసి వెళ్లిపోతారు జనం.

భీమశంకరానిది కోనసీమ. కొడుకు రామలింగానికి రెడ్డి సీమ పిల్లని వివాహం చేశాడు. రామలింగం ఇరవై ఏళ్లు లోపు

వాడు. పిల్లగలవాళ్లు చాలా భాగ్యవంతులని రెడ్డిసీమ పిల్లని దూరమైనప్పటికీ పెళ్లిచేశాడు భీమశంకరం. పిల్లవయస్సు ఎనిమిది ఏళ్లు. పెళ్లి అయిదురోజులూ మహావైభవంగా జరిగింది. కట్నాలూ, కానుకలూ, లాంఛనాలూ పేచీ పూచీలు లేకుండా జరిగాయి. మస్తుగా ధనముంటే అన్నీ సవ్యంగానే వుంటాయి. అది లేకపోతే అంతా అపసవ్యమే. ధనప్రభావమట్టిది. పిల్లని గృహప్రవేశానికి తీసుకువెడుతున్నారు. మగపెళ్లివారూ, ఆడపెళ్లివారూ కలిసి నూరుమందిలా కోనసీమకి బయలుదేరారు. పెళ్లికూతుర్ని, పెళ్లికొడుకుని పల్లకీలో ముందు బోయీలు తీసుకువెడుతున్నారు. పెళ్లికూతురూ, పెళ్లికొడుకూ పచ్చని మధుపర్కాలతో, కంకణాలతో, చూడ వేడుకగావున్నారు. బుగ్గకి నల్లచుక్కా, కళ్లకి కాటుకా, కాళ్లకి పసుపూ, పారాణీ ఆ నూతన దంపతులకి నూతనాలంకారంగా వున్నాయి. రామలింగం చామనచాయశరీరం పసుపుకలిపి రాసిన గంధం మీద మరింత సౌందర్యంగావుంది. అతని ఉన్నతవక్షం, విశాలనేత్రాలూ సహజధైర్యాన్ని తెలియపరుస్తున్నాయి. ముందుగా పల్లకీ కోడేటిరేవుదగ్గిరికి వచ్చింది. బోయీలు పల్లకీదింపి శ్రమ తీర్చుకొంటున్నారు. వెనుక పరివారం, బంధువులూ వస్తున్నారు.

## కా మి ని

సాయంకాలమైంది. నీరెండపడి గోదావరిలో ఎర్రమట్టితో కలిసిన ఇసక ప్రదేశాలు కుంకుమభూముల్లావున్నాయి. ఆకాశం నిండా పక్షులు పెండికట్టేసినట్లు పోతున్నాయి. లంకల్లో జనం ఈవలివొడ్డుకి వచ్చేశారు. రెల్లుదుబ్బుల చివర్లనుండే వెన్నెలు గోదావరమ్మ గృహారామంలోవున్న విద్యుద్దీపాల్లా ప్రకాశిస్తున్నాయి. గోదావరీజలమూ, రెల్లుశిఖలమీది వెన్నెలూ చూసేవారికి భూమా ఆకాశమా ? అనిపిస్తోంది. పెళ్లివారు రేవుదాటే ప్రయత్నంలో వున్నారు. పల్లకీతో అందరూ వొక్కసారే రేవులోని నావదగ్గిరికి బయలుదేరారు. సమీపంగానే వుంది పడవలవాళ్ల పల్లె. పెళ్లివారు వెళ్లి పిలిచారు వాళ్లని. తిరిగి వచ్చేసరికి చాలారాత్రి అవుతుంది రామన్నారువాళ్లు. చాలా ధనం ఇస్తామన్నారు. ఎంతడబ్బిచ్చినా రామన్నారు. కావలిస్తే మీరే తీసుకువెళ్లండన్నారు పడవల్ని పల్లీలు.

అప్పుడే నాలుగుదిక్కులనుండీ చీకటిరేఖలు సాగుతున్నాయి. దుబ్బుల్లో చీకటినిండింది. వేగిరం రేవుదాటాలి. అందరిమనస్సులూ ఆందోళనగా ఉన్నాయి. దుబ్బుల్లో సన్నని దారిని నావదగ్గిరికి చేరుకొన్నారు పెళ్లివారు, వారే పడవలు నడుపుకొని వెళ్లడానికి నిశ్చయించుకొన్నారు. వొడ్డుకిచాలా క్రింద వున్నాయి నావలు. ముందోనావలో పెళ్లిపల్లకీ పెట్టారు. అందులోనే పెళ్లికూతురూ, పెళ్లికొడుకూ కూర్చున్నారు.

# దయ్యాలు

ఆ నావలో కొంతమంది మంత్రవేత్తలూ, మంచిబలమైనవాళ్లూ కూర్చున్నారు. మిగతానావల్లో తక్కినవాళ్లెక్కారు. ఒడ్డున ఎవ్వరూ లేరు. పడవలు కదులుతున్నాయి.

మైమరచే చిన్నపాట వినిపించింది. స్త్రీకంఠం నుండీ వచ్చిన పాటది. ఆపాట గోదావరిలోని పిల్లకెరటాలు లయగా కలిసి మహామోహనంగా వుంది. పాటకి తీరాలలోని వనస్పతులు చలనంలేక నిలిచిపోయాయి. గోదావరికూడా స్తంభించిపోయినట్టుంది. పెళ్లివారి మనస్సులు పాటవెంట మళ్లాయి. పాట ఆగింది. పడవలు నడవబోయాయి. పడవలో పెళ్లికొడుకు లేడు. గొల్లుమన్నారందరూ. పడవ లల్లకల్లోల మయ్యాయి. కేకలు పెట్టేవారూ, ఏడ్చేవారూ, ప్రార్థించేవారూ, భయంవల్ల మూగై పోయినవారూ, "అమ్మో! అమ్మో!!" అనేవారూ, తల్లుల వొడిలికి చుట్టుకొన్న పిల్లలూ ఆవిసంగా నానాగందరగోళంగానూ వుంది. ఎటువెళ్లి వెతకడానికీ వీలులేకుండా. అందరూ తిరిగి గట్టుపైకి వచ్చారు. గట్టుమీద పరుగులెత్తి పిలుస్తూ చూస్తున్నారు. "ఒరే! రామలింగం! రామా!" అనే కేకలు భూనభోంతరాళాలు నిండిపోతున్నాయి. జవాబు లేదు. పోనీ; గోదావరిలో పడ్డాడేమో అని ఆలోచించారు. నీటిలో పూతీపుడక పడిన చప్పుడైనా వినిపించలేదు ఎవరికీని. పెళ్లికూతురు, నీటిలో పడలేదని, ఏడుస్తూ చెప్పింది. మరి

రామలింగం ఏమైనట్టు? తెగించి ప్రతిరుప్పా వెతికారు. అజా, పతా లేదు. ఆబాలవృద్ధులూ దుఃఖంతో వున్నారు. 'రామలింగం' అని అందరూ కేకలేస్తున్నారు. పిల్లవాని తల్లిదండ్రుల దుఃఖం వర్ణనాతీతంగా వుంది. శ్మశానంలోకి కూడా వెళ్ళి వెతికారు. రామలింగం జాడ కనపడలేదు. చివరికి పిల్లాడు గోదావరిలో మునిగిపోయాడని నిశ్చయించుకొన్నారు. పెళ్ళి ఆనందమంతా చావు దుఃఖంగా మారింది.

౨

కొన్నాళ్ళు నిరీక్షించి రామలింగానికి ఆబ్దికాలు పెడుతున్నారు. పాపమూ చిన్నపిల్లకి కేశఖండన మాత్రం జరుగలేదు. ఏడేళ్ళుగడిచాయి. రామలింగం తల్లిదండ్రులు పుత్రశోకమువల్ల నానాటికి కృశించిపోయారు.

నాను రామలింగం కోడేటి రేవులో మాయమైనప్పటినుంచీ వారి ఆస్తికూడా తరిగిపోయింది. పదకొండో ఏడు వచ్చింది. అంతర్వేదీ, సింహాచలం, కోటిపల్లీ, కాశీ, గయా మొదలైన క్షేత్రాలకి వెళ్ళిన భీమశంకరం బంధువులనుండీ, మిత్రులనుండి రామలింగం ఆయా క్షేత్రాల్లో గర్భాలయాల్లో కనిపించాడనీ, బాగా పుష్టిగా వున్నాడనీ, పైకి వచ్చాక మాట్లాడదామను

# దయ్యాలు

కొంటుగాంటే మాయమైనాడనీ వార్తలు వచ్చాయి. వారి కామాటలు తిరిగి ఆశ కలిగించాయి. కాని, అది వారి భ్రాంతేమో? అనుకొన్నారు. పదేళ్లక్రిందట గోదావరిలో పడిపోయిన రామలింగం తిరిగి కనిపించడ మేమిటి? మనిషిని పోలిన మనిషిని చూసి రామలింగమే అని భ్రమపడ్డా రేమో? ఇంతవరకూ బ్రతికివుంటే ఇంటికోసా రేనా రాడా? వట్టిమాట. వారు నిజంగా భ్రమపడ్డారు. చచ్చిపోయి బ్రతికినవారున్నారా? నాయనా! మాకూ, వాడికీ ఆనాడే ఋణాలబంధం తెగి పోయింది. ఇక మాకు వాణ్ణి చూసే భాగ్యంలేదు. మాకడుపులో చిచ్చుపెట్టి పోయావు మాబాబు. అని ఆవార్తలు విన్నప్పుడెల్లా కడిపిల్లాడి ఏడుస్తూ నిరాశపడ్డారా వృద్ధ దంపతులు.

అతిదరిద్రంతో బాధపడుతున్నాడు భీమశంకరం. ఓనాడు రాత్రి అతిదుఃఖంతో పడుకొన్నాడతడు. ఆనిద్రలో రూపాయలమూట తలక్రిందవున్నట్టు స్వప్నంవచ్చింది. అదరిపడి లేచి చూశాడు. నిజంగా వేలరూపాయలు పసుపుగుడ్డని కట్టినమూట తీశాడు. ఆశ్చర్యమూ, భయమూ వేసిందతనికి. రెండోకంటికి తెలియకుండా పెరట్లో పాతిపెట్టాడు ఆధనాన్ని. ఆవిధంగా రోజూ బంగారు నాణ్యాలుకూడా వస్తూవుండేవి. ఎవరు తెచ్చి పెడుతున్నారో?

# కా మి ని

వేసంకాలం. రాత్రి రెండుఝాములు అయింది. రామలింగం పదకొండో తద్దినంనాడు పెట్టారు. రామలింగాన్ని తలచుకొని, తలచుకొని దుఃఖిస్తూ నిద్రరాక భీమశంకరం, ఇంట్లో వాళ్లూ నడివాకిట్లో కూర్చొని వున్నారు. మల్లీ, గులాబీ, చేమంతీ, మొగలీపువ్వుల వాసన్ని మించిన అపూర్వమైన వాసన వచ్చింది. మంచిగంధం, కస్తూరీ, జవ్వాజీ, పునుగూ మొదలైన వాసనల్ని కూడా తిరస్కరిస్తోందా వాసన. ఈ సువాసన ఎక్కడిదని ఆలోచిస్తున్నారు. ఆ సువాసన అంతకంతకి హెచ్చింది. కొంతసేపటికి "అమ్మా! అమ్మా!! తలుపుతియ్యి!!!" అన్న కేకలు వినిపించాయి. అవి రామలింగం కంఠంనుండి వచ్చినట్టు వున్నాయని అనుమానిస్తూ ముందుగా వెళ్లి తలుపు తీసింది భీమశంకరం భార్య. ఎదుట రామలింగం. నమ్మలేకపోయింది మొదట. రామలింగం అమ్మా! అన్నాడు. ఆమె రామలింగాన్ని గట్టిగా కౌగలించుకొని ఏడ్చింది. ఇంట్లో వాళ్లూ, వీధిలో వాళ్లూ రామలింగాన్ని చుట్టుకొన్నారు. ఎన్నాళ్లకి కనిపించావురా బాబూ! అని అందరూ గొల్లుమన్నారు. 'పోరా! ఎంతమాట! ఈ వేళ విడి తద్దినమా!' అన్నారు పైవాళ్లు. ఆమాటలువిని రామలింగం నీరువిడిచిపోయాడు. తల్లి కొడుకుని కాగలించుకొని ఎంతసేపటికీ విడిచిందికాదు. తన దుఃఖం తెలియనీక ఎల్లాగో అందరినీ ఓదార్చాడు రామలింగం.

దుఃఖంతో స్తంభించిపోయిన తండ్రిని కౌగలించుకొని ఊరడించాడు.

కొంతసేపటికి అందరూ ఆనందంగా కూర్చున్నారు. 'ఇన్నాళ్లెక్కడికి వెళ్లావు? ఎక్కడున్నావు? ఎల్లా మాయమైనావు? ఏంచేస్తున్నావు? మమ్మల్ని మరిచిపోయావా!' అని అందరూ ఆదరంగా ప్రశ్నించారు రామలింగాన్ని. తల్లి అన్నం తిందువుగాని లే అని హెచ్చరించింది. రామలింగం తన సంగతి చెప్పడానికి మొదలుపెట్టాడు. ఇంతలో ప్రక్కగది తలుపులు అప్రయత్నంగా మూతపడ్డాయి. అందులోంచి హృదయమధురంగా, అశరీరంగా కొన్నిమాటలు ఆ గదిలోంచి పొగలా వచ్చాయి. అందరూ కొయ్యబొమ్మల్లా వుండిపోయారు.

"నాది పల్లాం. రాజులపిల్లని. పాతికేళ్లు వచ్చినా పెళ్లి కాలేదు. పెళ్లికాకుండా మరణించాను. కోరికలు తీరలేదు. శరీరాన్ని గోదావరి రేవులో కాల్చేశారు. అప్పటినుంచీ ఇక్కడే వున్నాను. మంచివాడికోసం చూస్తున్నా. చాలాకాలం అయింది మంచివాడు దొరకలేదు. వారమై చాలా అల్లరిగా తిరుగుతున్నానిక్కడ. మీ అబ్బాయి మంచివాడని నాతో తీసుకొనిపోయాను. ఇంకో ఏడుదాకా విడిచిపెట్టను. ఇంకొక్క సంవత్సరం వరకూ ఆయన భార్యని తీసుకురావద్దు. ఆయన

కేమీ ప్రమాదం లేకుండా తీసుకువచ్చి మీకు అప్పగిస్తాను. నాకీజన్మ పన్నెండేళ్ళకు పైమాట. మీకిదివరకు శపమిస్తూ వుంటా నేనే. ఇంకొస్తాను. మీకోడలికి కావలసిన వస్తువు లిస్తాను. నేనెక్కడికి మీ అబ్బాయిని ఎక్కడికి తీసుకువెళు తున్నానో ఆయనకు తెలియదు. రోజూ ఆయన్ని తీసుకు వస్తాను." అంటూ రామలింగాన్ని వెంటనే తీసుకుపోయిందా అదృశ్యవ్యక్తి. వారందరూ స్తబ్ధులైపోయారు.

చెప్పిన ప్రకారం వారి కోరికలు తీరుస్తూంది, రామలింగాన్ని తీసుకొని వస్తూందా వ్యక్తి. సీమశేఖరం మహా భాగ్యవంతుడై నాడు.

ఒక్కరోజైనా తక్కువ కాకుండా పన్నెండేళ్లూ గతించాయి. పదమూడో యేడు ప్రారంభమైంది. నాటిరాత్రి రామలింగం రత్నాభరణాలతో పరభోగవసంతరాయనిలా ఇంటికి వచ్చాడు. అతను రావడం అతనికే తెలియదు.

సమస్తకోరికలూ తీర్చే కామదవృత్తాంతం తెలేదు.

# బుచ్చి

౧

రామం పాలు పితికాడు. పాలేర్ని జాగ్రత్తగా ఉండమనీ పశువులికి గడ్డి గాదం వేయుమనీ చెప్పి బయలుదేరాడు రామం ఇంటికి. "సాయం రమ్మన్నారా?" అన్నాడు పాలేరు. అక్కరలేదు నాన్న ఇచ్చిన మేకు మొల్లో ఉందిలే అన్నాడు రామం.

బాగా చీకటిపడింది. రామం శ్మశానాల పుంతలోంచి రావాలి ఇంటికి. పుంతనిండా మర్రిచెట్లూ, రావిచెట్లూ దట్టంగా ఇరువేపులా ఉన్నాయి. ఈ చెట్టుకొమ్మలూ, ఆ చెట్టుకొమ్మలూ కలిసిపోయి ఉన్నాయి. పందిరి వేసినట్టుంటుంది ఆ పుంత. అంచేత పగలు నాలుగుగంటలకే రాత్రి పన్నెండు గంటలల్లా వుంటుంది. ఆ చెట్లక్రిందనించే రామం వస్తున్నాడు ఒంటరిగా. ఆకులసందులో నుంచివచ్చే నక్షత్రకాంతిని మెల్లగా వస్తున్నాడు. రామం పుంతమధ్యకి వచ్చేసరికి ఆమహా వృక్షాల్ని ఆశ్రయించివున్న పక్షులన్నీ వింతకూతలతో చెల్లా

చెదరై ఎగిరిపోయాయి. పుంతదాటి పదిబారలు వచ్చాడు. అతనికి గాజులచప్పుడు వినిపించింది. వెనక్కి తిరగలేదు. అందెలూ కడియాలూ చప్పుడు వినిపించింది దూరాన్ని. వెనక్కి తిరగలేదు. ఓ స్త్రీ వెనకాతలే వస్తూన్నట్టుంది. వెనక్కి తిరగ లేదు. అంతకంతకి గ్రామాన్ని సమీపిస్తోంది వెనకాతల వ్యక్తి. అతడు వెనక్కి తిరగలేదు. దగ్గూ, నవ్వూ వినిపించింది. చూడ లేదు.

"ఒరే! ఇల్లాగోసారి చూడ్రా"

"నీ సంగతి నాకు తెలుసు లే"

"ఇదిగో! నే నెల్లావున్నానో చూసి"

"ఎల్లావుంటే నా కెందుకు?"

"నిన్నేమీ చేయనులే"

"ఏమీ చేయకపోయినా సరే నిన్ను మాత్రం చూడను"

"ఎంచేత?"

"అల్లాగ"

"కారణం?"

"నాకు తెలుసు, నీకు తెలుసు"

"చూద్దూ"

"ఊఁ హూఁ"

"లాభం లేదు"

"చెంబు తీసుకోకుండా వెళతావా!"

"వస్తాలే!"

"మీ నాన్న ఆ పాలచెంబొకసారి ఇచ్చాడు తెలుసా?"

"మళ్ళీ ఆయన్నే అడుగు."

"అమ్మో!!—"

"ఇచ్చేవాడి దగ్గర—పుచ్చుకోడాని కేమీ?"

"మా నాన్న చాలాకాలం నుంచి ఇల్లా నాకివ్వ లేదని."

"నీ కివ్వడానికి వస్తాడుతే—పాలు"

"ముసలితనంలో—కళ్ళు కనపడకుండా పుస్తకాలు చదువుతున్నాడా! చోద్యం మాటలు చెప్తావు!"

"ఇంటికి వచ్చి అడుగు."

"ఈ మాత్రానికి ఇంటి కెందుకూ? నువ్విచ్చూ!"

"మా నాన్న కోప్పడతాడు."

"నీ కీమాత్రం స్వతంత్రం లేదూ?"

"నా కివ్వడానికి లేదు."

"పోనీ! రెండు నిమిషాలు నిలు."

"ఊఁ హూఁ"

"పోనీ! వెనక్కి తిరుగు."

"ఊఁ హూఁ"

"సరే;—నీళ్లు నెత్తికొచ్చాయి!"

"జాగ్రత్తగా మాట్లాడు!"

"ఏం చేస్తావు?"

"ప్రాంతలో ఉండకుండా చేయిస్తా!"

"కాసులిస్తా వస్తావా?"

"రాను."

కుప్పగా కాసులు కాళ్లక్రింద పడ్డాయి. అవి దాటి నడుస్తున్నాడు రామం.

"చాలా గట్టివాడివిరా!"

"నీ మాయల్లో పడతాననుకొన్నావా?"

"చెంబివ్వవురా?"

"చెంబుమాట ఎత్తొద్దన్నా; తెలుసా?"

"ఇవ్వనన్నమాటే?"

"ఆఁ...హాఁ..."

"నా సంగతి తెలుసా?"

"తెలియకేమీ! కరణంగారి పెళ్ళానివనీ, అకాలంలో చచ్చి ఈ ప్రాంతలో వున్నావనీ, వారింట్లో అల్లరి ప్రారంభిస్తే భూస్థాపితం చేయడానికి ప్రయత్నించారనీ, ఏడిస్తే వొదలారనీ,

ప్రతీ వాళ్ళింటిలోనూ దూరి చెప్పుదెబ్బలూ, ముంతపొగలూ తింటూవుంటావనీ, నిన్ను గ్రామంలోకి రానీకుండా చేశారనీ, ఇల్లాంటి నీ పుట్టుపూర్వాలన్నీ తెలుసు. పెద్దింటిలో పుట్టి ఇల్లా తగులడడం నీ ప్రారబ్ధం ఎవ్వరేమిచేస్తారు. అందరికీ అపఖ్యాతి తెస్తున్నావు. నీమూలంగా ఆయన పీఠలో తిరగడంకూడా మానేశాడు పాపం. పిల్లలులేని ముండవు కాబట్టి పిల్లల్ని ఏడి పిస్తావు. నీవుచేసే దుర్మార్గాలకింక మంచి జన్మరాదు" అంటూ తిట్లు ప్రారంభించాడు రాముం. దానికడ్డంగా ఆకాశాన్నంటుతూ కొంతదూరంలో హఠాత్తుగా మహావృక్షం పుట్టింది. ఆ చెట్టు చూడగానే రామూనికి ఎక్కడలేని భయంవేసింది. ఆ చెట్టు మీదనుండీ, క్రిందనుండీ బుసకొడుతూ పెద్దపెద్ద పాములు బయలుదేరాయి. కణకణలాడుతూఉన్న నిప్పులు [illegible] దగ్గరిగా పడుతున్నాయి. మీద పడడంలేదు. చుట్టూ చెట్లు కొద్దీ పడుతున్నాయి. పైనుండీ పుర్రెలూ, మలమూత్రాలూ కూడా పడుతున్నాయి. రాళ్లు పడుతున్నాయి. రామూనికి భయం అధికమైంది. అతనికి దారీ తెన్నూ కనపడలేదు. ఏలాగో కొద్దిధైర్యం తెచ్చుకొన్నాడు. మేకుమాట జ్ఞాపకానికి వచ్చింది. ఇదంతా దానిమాయే అనుకొన్నాడు. మొలలో మేకుతీసి దూరంగా గిరిగీసి గిరిలో కూర్చుంటున్నాడు. తల తిరిగింది. కెవ్వున కేకేసి గిరిఅవతల పడిపోయాడు.

# దయ్యాలు

రామం ఎంతరాత్రైనా ఇంటికి రాకపోవడంచూసి ఏంజరిగిందో అని లాంతరు తీసుకొని బయలుదేరారు అన్నలిద్దరూను. కొంతదూరం వచ్చేసరికి చెరుకుతోట దగ్గిర రక్తం వాంతి చేసుకొని పడి ఉన్నతమ్ముడు కనిపించాడు. తొందరగా లేవ తీశారు. పాలచెంబో వేపు పడిపోయివుంది. తలమీది పెద్ద గాయంలోంచి రక్తం ప్రవహిస్తోంది. 'రామా!' అన్నారు. 'బుచ్చిరా' అని మళ్లీ పడిపోయాడు. చేతులమీద ఇంటికి మోసుకుపోయారు. మతిలేదు రామానికి.

మాటిమాటికీ, "బుచ్చి, అదిగో! రమ్మంటోంది. వెళ్లిపోవాలి, ఇంక ఉండను, పట్టుకోకండి, ఒదిలెయ్యండి, అదిగో! చేతులెత్తి పిలుస్తోంది, ఉండండ్రా!, విడిచిపెట్టరూ? అహాహా! అహాహ్హా!! చూడు ఎల్లాఉందో? ఎంత అందంగాఉందో,—పువ్వులిస్తాను రమ్మంటోంది. పూలదండ పట్టుకు నుంచుంది నాకోసం. అదిగో!—అదిగో!—ఉండు వస్తాను, మావాళ్లు వదలడంలేదు; ఉండు—ఎంత ఆనందంగా ఆడుతోందో!—చూడరా అన్నయ్యా!, నాన్నా!...నన్ను బుచ్చి దగ్గిరికి, పంపవూ? అమ్మా!!...చూశావా?—పాలు ఇస్తాను రమ్మంటోంది. బుచ్చీ!!—అమ్మో!!—దగ్గిరికి రాకు. బాబోయ్! ...మీదికిరాకు. అమ్మా!—అమ్మా!!...; మీదపడతావా? అల్లానవ్వుతున్నా వెందుకూ?—ఎంతబాగా నవ్వుతోందో!—

వేగిరమే వస్తాను" అంటూ ప్రేలాపన ప్రారంభించాడు రామం. ప్రేలాపనకి విధీ, విరామంలేదు. ప్రేలాపన దినదినాభివృద్ధి చెందింది. మంచం మీదినుంచి లేస్తున్నాడు కూడాను. పట్టుకోవడం కష్టమైంది రామాన్ని. మంచానికి కట్టేశారు. భూతవైద్యం చేయించారు. లాభం లేకపోయింది. క్రమేపీ ధోరణి మారింది. రూపంకూడా మారిపోయింది. నీరసించిపోయాడు.

నెల అయింది సరిగ్గా. ఆరోజూ, ఆవేళా వచ్చింది. రామం శవం ఆపుంతలోకి వెళ్లింది.—

## ౬

"ఇందిరా!" అని కేకవేశాడు భోజనం దగ్గరనుండి రాజు.

"ఆఁ—అవ్వనూ ఇంది—రానూ వచ్చాను."

"రాకేం?"

"వాళ్లిద్దర్నీ నేతినేశాను."

"ఎవఁడా—? ఆజవాబూ?"

"అహ్హాహ్హా—ఇదిగో—నేనూ—వ్యాఘ్రావధాన్ని" అని గది నిలువునా నుంచున్నాడు బ్రహ్మరాక్షసి. శరీరం కంపించింది రాజుకి. చూడలేక కళ్లుమూసుకొన్నాడు. అన్నం చూశాడు; రక్తంతో నిండివుంది. నీళ్లు తీశాడు దుర్వాసన. గది దుర్గంధపూరితం. పారిపోవడానికి చూశాడు రాజు. అక్కడిద్దరుంటే వారప్పుడే పారిపోయారు. బ్రహ్మరాక్షసి రాజు నెత్తిమీద కూర్చున్నాడు కదలకుండా. అతను వెర్రికేకలు పెట్టాడు. స్త్రీ పురుషాదులు గదిని చుట్టుకొన్నారు. ఎవ్వరూ గదిలోకి కాలు పెట్టలేక పోయారు. భూనభోంతరాళాలు పగిలిపోయేట్టు శ్రాద్ధం మంత్రాలు చదవటం ప్రారంభిం

చాడు బ్రహ్మరాక్షసి. గదినిండా భూతాలే కనిపించాయి. మేడంతా రోదనధ్వనితోనూ, అపరకర్మ మంత్రాలతోనూ నిండిపోయింది. స్పృహతప్పి కూలపడ్డాడు రాజు. రాజు నెత్తి మీదే కూర్చున్నాడు బ్రహ్మరాక్షసి. జనమంతా చూస్తూండగా రాజు గెడ్డం కాల్చేశాడు. జుట్టు పట్టుకొని బరబరా ఈడుస్తున్నాడు. రాజు రోదనధ్వనీ రాక్షసి కేకలూ భయంకరంగా ఉన్నాయి. రాజుని రక్షించడానికి ఎవరికీ శక్తిలేదు.

౨

అది అయిదిళ్ల అగ్రహారం. రెడ్డిపల్లి అగ్రహారం లాంటిది కాదు. ఆ అయిదిళ్లూ బ్రాహ్మణులవే. ఆ వూరు మొఖాసాదారు రాజు శివకేశవుల ఆలయాలు కట్టించి తనపేరుపెట్టి, పూర్తిగా వేదశాస్త్రాలు చదువుకొన్న ఐదుగురు బ్రాహ్మణులికి దానం చేశాడు. అందులో వొకాయన వారింటి పురోహితుడు. పేరు వ్యాఘ్రావధాని. ప్రతీదినమూ తెల్లవారు జామున లేచి స్నానసంధ్యాది వైదిక కృత్యాలు పూర్తిచేసుకొని తర్వాత అతిశుచిగా మంచినీళ్లేనా త్రాగక రాజప్రాసాదానికి వెళ్లేవాడు. రాజుగారిభోజన సమయానికి అక్కడ వుండాలి. రాజు భోం చేస్తూంటే కొన్నిబుక్కలు స్వస్తి చెప్పాలి. అది అతని నిత్యకృత్యం. కోటలో పనిచూసుకొని

తిరిగివచ్చి తాను భోం చేసేవాడు. అక్కడ పనైన తరువాయి మర్నాడు మళ్లా ఆవేళదాకా కోటలోకి పోనక్కరలేదవధాని.

అగ్రహారం చేసినరాజు స్వర్గం చేరాడు. అతని కుమారుడు పెత్తనదారైనాడు. ఇతనికి వేటంటే సరదా. పందాలంటే చెవి కోసుకొంటాడు. గుర్రం పందాలు, కోడిపందాలు, గొర్రి పోతుపందాలు, కవుజుపిట్ట పందాలు, పికిలిపిట్టపందాలు, డేగ పందాలూ వేలకువేలు కర్చుపెట్టి జరిపేవాడు. ఏ వూళ్లో జరుగుతున్నాయన్నా వందలకొలదీ సిబ్బందితో చూడ్డానికి బయలుదేరేవాడు. కుటుంబమంతా నూరు నూటపఖై మంది. అంతేకాదు వూళ్లో రాచపుట్టంతా తనమీదే ఆధారపడివుంది. నల్లమందు వేస్తాడు. మత్తుపదార్థాల కలవాటు పడ్డాడు. నిషాగా వుండని క్షణంలేదు. మత్తులేకపోతే సత్తువ లేదతనికి. వాటి వినోదాల్లో వుండేవాడు నిత్యమూ ఆ రాజకుమారుడు.

కొలది కాలంలోనే జమీ అప్పులపాలైంది. ఆస్తి కర్పూరంలా హారించిపోయింది. బంధువులతన్ని విడిచారు. మిత్రులు అంతకుమునుపే జాగ్రత్తపడ్డారు సమయానుకూలంగా అతని మీద పడడానికి. అప్పులు పెరిగిపోతున్నాయి. వ్యయమే కాని ఆదాయంలేదు. చేజీతాలవారూ, నౌఖరులూ సన్నసన్నగా మానేశారు. అప్పుతీర్చడం లేదని వేరేచెప్పాలా? నిరంకు

శాధికారం చెలాయిస్తున్నాడు. అప్పిచ్చినవాళ్లు స్థిరాస్తిని తాకలేక పోయారు. ఎటుచూసినా దావాలూ, జప్తులూను. జప్తుచేసి సొమ్ము తీసుకోడానికెవరికీ శక్తిలేదు. ఎంత ధనం లేకపోయినా పురందరకీ కుమారరాజు ఎంతచెపితే అంత. పలుకుబడి చావలేదు. అంచేత ఆ యింటివేపూ, ఊరువేపూ కన్నెత్తి చూడడానికి సందిచ్చింది కాదు అప్పులవారికి. ఈ విధంగా సంవత్సరాలు వెళ్లాయి. కానీ తీరలేదు.

అవధాని కాలమతిక్రమించకుండా కోటలోకి వెడుతు న్నాడు. ఓరోజు సింహద్వారం దగ్గిరో బీదవాడు కనిపించా డతనికి. "బాబయ్యా! తమరు లోగిలిలోకి వెడుతున్నారు. రాజుగారికి, విన్నపం రాసుకొన్నాను. పత్రం వారికిమ్మని ఎవర్ని ప్రార్థించినా అంగీకరించలేదు. తమరేనా అందచేయండి బాబూ! పిల్లలు గలవాణ్ణి." అని కాగితం ఒకటిచ్చాడు అవ ధానికి. అది చక్రవర్తి ఆజ్ఞాపత్రం. ఆ పత్రం చూసినవెంటనే ఎవరైనాసరే పత్రం తెచ్చినవారితో చక్రవర్తి సమ్ముఖానికి వెళ్లాలి. అడ్డుచెపితే తల భుజాలమీద ఉండదు. అంతకఠోర శాసనపత్రం అది. పత్రం సంగతి తెలియని అవధాని పాపం బీదవాడు; రాజు కందచేస్తే ఏమైనా ఇస్తాడని పట్టుకొని లోపలికి వెళ్లాడు.

## దయ్యాలు

రాజు సంధ్యావందనాలు తీర్చుకొన్నాడు. భోజనానికి కూర్చున్నాడు. ప్రక్కలనే ఇద్దరు ఖడ్గపాణులై నిలుచున్నారు. నల్లమందు సేవించడంవల్ల రాజు కన్నులు మూతపడుతున్నాయి. ఏ ఏ పదార్థాలెక్కడున్నాయో చెప్పుతున్నారిద్దరు. అవధాని ఆశీర్వచన పనస ముక్తకంఠంతో చెప్పాడు. నేత్రాలు విప్పాడు రాజు. ఇదే సమయమని తెచ్చినకాగితం చూపించాడవధాని. గుభాల్న పత్రం అందుకొన్నాడు రాజు. పత్రం ఆమూలాగ్రం చూస్తూ, అవధానిమీదికి వేడిచూపులు విడిచాడు. అవధాని ద్రోహం చేస్తున్నాడనుకొన్నాడు. పాపం అవధానికేమీ తెలియదు. సమయం కాని సమయంలో పత్రం చూపించాడని క్రోధం మూర్తీభవించింది. నిలువునా కాల్చేసే చూపులు విరజిమ్మాడవధానిమీద. అవధాని కర్థం కాలేదు. పేదవాడి ఉత్తరానికింత ఆగ్రహం ఏమిటనుకొన్నాడు తనలో. "ఏం బాబూ! ఆగ్రహం తెప్పించాను. క్షమించాలి." అన్నాడవధాని. ఒకే మూల్గు మూల్గాడు రాజు. వెంటనే భటులవధాన్ని కాళ్లూ చేతులూ విరిచికట్టి దొడ్లోకి తీసుకుపోయి నిర్దాక్షిణ్యంగా—

అవధాని వెంటనే బ్రహ్మరాక్షసి అయిపోయి రాజుకి ప్రత్యక్షమైనాడు. క్రోధంతో పగసాధిస్తున్నాడు.

౩

ఆ ఇంట్లో ఎవళ్లుండగలరు? ఇంట్లో వాళ్లా భవనాలు విడిచి దూరంగా క్రొత్తభవనాలు కట్టుకొని వాటిలో ఉన్నారు. బ్రహ్మరాక్షసి క్రొత్తభవనాల్లో కూడా ప్రవేశిస్తుందని దేశ దేశాలనుంచి మంత్రవేత్తల్ని రప్పించి ఇంటిచుట్టూ కావలా పెట్టుకొన్నారు. రాజూ, బ్రహ్మరాక్షసీ పాతఇంట్లో ఉన్నారు. భవనాలన్నీ పాడుపడ్డాయి. రాజుని అధిక బాధలు పెట్టేది బ్రహ్మరాక్షసి. తుదకి నిద్రాహారాలు లేకుండా చేసింది. రాజు శల్యావశిష్టు డయ్యాడు. కొన వూపిరితో ఉన్నాడు.

అమావాస్య. వుదయంనుండీ మహాధ్వనులా పాతఇంట్లో బయలుదేరాయి. దూరంలోవున్న రాజబంధువులికి కూడా వినిపిస్తున్నాయి. భవనాలగోడ లొక్కటొక్కటే కూలిపోతు న్నాయి. సాయంకాలానికి రాజున్న గదితప్ప తక్కిన భవ నాలన్నీ కూలిపోయాయి. నిశీథమైంది. నిశ్శబ్దంగా వుంది. గుడ్లగూబలు ఘూకరిస్తూ ఎగురుతున్నాయి. గబ్బిలాలూ, తలక్రిందుపక్షులూ ఆ గదిలోంచి పైకి వస్తున్నాయి. రాజుని సమీపించింది బ్రహ్మరాక్షసి. తలక్రిందుగా రాజుని పట్టుకొంది. పైకెగరేసి తిరిగి పట్టుకుంది. పెళపెళధ్వనితో గది కూలబ్రో సింది. రాజుతో క్రొత్తభవనాల్లో ప్రవేశించింది. బ్రహ్మరాక్ష

సినిచూసి మంత్రవేత్తలు పిక్కసత్తువ ప్రదర్శించారు. వొంఖ బొబ్బతో అందరినీ లేపింది. బిలబిలలాడుతూ వాళ్ళందరూ లేచారు. బ్రహ్మరాక్షసి ఎదురుగా ఉన్నాడు. రక్షించమని బ్రహ్మరాక్షసిని వాళ్లు ప్రార్థించారు. వాళ్లు చూస్తూఉండగా రాజుమెడలు విర్చి చంపి పారేసి మాయమైపోయాడు బ్రహ్మ రాక్షసి.

ఆ పాడు దిబ్బలనిండా బలురక్కసీ, బ్రహ్మదండీ, బ్రహ్మ చెముడూ, కిత్తనారా, ముండ్లపొదలూ పెరిగి పోయాయి.

# దేవతా? దయ్యమా?

౭

"పాపమా బ్రాహ్మడి కెంత కష్టంవచ్చింది. శుద్ధ వెర్రి బ్రాహ్మడు. యెగ్గెంకూడా చేశాడు. అచ్చు ఆవుపాలలాంటి మనస్సుగలవాడు. ఆ బాబింటిలో రోజూ పదిమందేనా విస్తరెయ్యకుండా వుండరు. ఇల్లా ఇంకా ఎన్నాళ్లు బాధపడాలో ఆ బాబు"— అంది రాంపిల్లిఅగ్రహారంలో అడుగుపెడుతూ పెరుగమ్మే జగ్గమ్మ. వెంటనే చీరచివర కొంగు అంటుకుంది. మండిపోతూంది చీర. నెత్తిమీదగంప క్రింద పడింది. గొల్లుమంది. మంటలు మొలదాకా వచ్చాయి. "తల్లీ! క్షమించు, తప్పుగా మాట్లాడాను." అని దణ్ణంపెట్టింది పెరుగుమనిషి. తక్షణంమంటలు ఆరిపోయాయి.

ఈ విధంగా సోమయాజికష్టాల్ని గురించి ఎవరేమనుకొన్నా జరిగేది అల్లరి. ఆ భయంచేత సోమయాజి కష్టాలుచూసి ఏమీ అనుకోకుండా ఊరుకొనేవారు ఎరిగున్నవాళ్లు.

సోమయాజి శుద్ధశ్రోత్రియుడు. ఆ అగ్రహారంలో కల్లా ధనవంతు డతడే. వేదాధ్యయనపరుడు. కేవలమూ వేదజడు డన

వచ్చును. నలభై ఏళ్లవాడు. యజ్ఞయాగాది కర్మలెన్నెన్ని శాస్త్రాల్లో రాసి ఉన్నాయో అవన్నీ యథావిధిగా చేసేడు. అతనికున్న ఖ్యాతీ, పలుకుబడీ ఎవరికీ లేదు. నిరతాన్నదాత. అతనికి పదిమంది కొడుకులూ, కూతుళ్లూను. సిరీసంపత్తులు సమానంగా ఉన్నాయి.

ఓనాడు కుతపకాలంలో ఒక అవధూత సోమయాజికి అతిథిగా వచ్చాడు. అవధూతని ఎల్లా అర్చించాలో అల్లా అర్చించాడు సోమయాజి. భిక్ష పూర్తి అయింది. విశ్రాంతి సమయంలో అతన్ని ప్రార్థించి "రాజరాజేశ్వరీ" మంత్రాన్ని ఉపదేశించమన్నాడు సోమయాజి. అవధూత నిర్వ్యాపడ్డాడు. నీవు సరిగా ఆమంత్రాన్ని పురశ్చరణచేసి దేవిని తృప్తిపరచలేవన్నాడు. సోమయాజి కామాటలు చెవిపట్టలేదు. అతని పట్టుదలచూసి అవధూత మంత్రాన్ని వుపదేశించి, నీవు సరిగ్గా మంత్రవిధులు నెరవేర్చలేనప్పుడు మంత్రం ఆవు చెవిలోనో, పాముపుట్టలోనో విడిచివేయమన్నాడు. సోమయాజి అల్లాగే చేస్తానన్నాడు.

యథావిధిగా పన్నెండేళ్లూ జపించాడు మంత్రాన్ని సోమయాజి. దేవి ప్రత్యక్షమైంది. అన్నశాంతి చాలిందికాదు. ప్రాణసంకటం వచ్చింది. 'ఆకలీ' అంటూ దేవి అన్నానికి ఆరాటం పెడుతూంది. ఆతను ఏమిచేస్తూన్నా చెవిలో 'ఆకలీ'

అన్న మాటలే వినిపిస్తున్నాయి. అవధూత చెప్పినట్లు మంత్రం ఆవుచెవిలో విడిస్తే ఆవు చస్తుందనీ, పాముపుట్టలో విడిస్తే పాము చస్తుందనీ అనుకొన్నాడు. దేవి ఆరాటం హెచ్చవుతూంది. అతని కేమీ పాలుపోలేదు. మంత్రాన్ని తెగించి విడువనూ లేదు.

*    *    *    *    *

నాన్నా ! జల్తారుచీర పెద్దపెట్టిలో వుంది ఇమ్మంది. అమ్మ అని సోమయాజిని కూతురడిగింది. ఇచ్చాడతడు. ఆ చీర పెరట్లోకి పట్టుకువెళ్లి తగలపెట్టేసింది. ఆ సంగతి ఎవరికీ తెలీదు. సోమయాజి మనస్సు ఆలోచనలతోనూ, ఆందోళనతోనూ నిండిపోయింది. దేవిని ఎల్లా తృప్తిపరచడమా? అన్న బెంగ పట్టింది. మరోనాడు అమ్మా నేనూ పేరంటానికి వెడతాం వస్తువులిమ్మని అడిగింది కూతురు. కావలసిన నగలిచ్చాడు సోమయాజి. రాత్రి వస్తువులు దాచడానికి సోమిదేవిని తెమ్మన్నాడు. వస్తువు లేమిటంది సోమిదేవి. ఇందాకా పేరంటానికి అమ్మాయి కాసులపేరూ, అవీ తెచ్చిందిగా అన్నాడు. ఏమో ! నేను తెమ్మన లేదందామె. పిల్లని పిలిచి అడిగాడు ఆత్రంతో. నా కివ్వలేదు నాన్నా ! అడగనూ లేదు నేనూ అంది పిల్ల. నిర్బంధించాడు కూతుర్ని. పాపమా పిల్లకి తెలిస్తే కదూ చెప్పడానికి ? వస్తువులకోసం అందరూ గందరగోళం

పడ్డారు. అనేకవిధాలుగా వారికి ఊహాలు వెళ్లాయి. లోగడ జల్తారు చీర ఫలానారోజున తెచ్చింది, అదేమయిం దన్నాడు సోమయాజి. తల్లీ పిల్లాకూడా ఆ సంగతే తెలియదన్నారు. ఈ మాయ ఏమిటో తెలియడం లేదని ఊరుకొన్నారు గుప్ చప్పుగా.

వారాలు దాటాయి. మా సాలతిక్రమించాయి. ఏళ్లకు ఏళ్లు వెళ్లాయి. ఇంట్లో నగలూ, బట్టలూ పోతూనే వున్నాయి. అవన్నీ సోమయాజి కూతురడిగి పుచ్చుకొన్నాకే పోతు న్నాయి. కాని, ఆ పిల్ల ఎవరిదగ్గిరికివెళ్లి ఏమి అడిగినా వెంటనే ఇచ్చేవారు.

పెట్టెలన్నీ కాళీ అయ్యాయి. భూములు తగాదాల్లో, తవ్వాయిల్లో పడిపోయాయి. రాయిలాంటి పెంకుటిల్లు కార ణం లేకుండా కాలిపోయింది. పొరుగింట కాపురం వచ్చింది. అల్లా కాలక్షేపం చేస్తున్నా చుట్టూవున్న ఇళ్లు కాలిపోకుండా సోమయాజి వున్నఇల్లు కాలిపోతూండేది. చివరికి సోమయాజి కిల్లు ఇవ్వడానికి సందేహాలు బయలుదేరాయి. పన్నెండేళ్లు గడిచాయి. సోమయాజి కష్టాలు గట్టెక్క లేదు.

నాడు సోమయాజి తండ్రితద్దినం. చుట్టాల్ని పిలవడం అల వాటుంది తద్దినాలకి. పిలిచాడు. చుట్టాలు చాలామంది వచ్చారు. ఊళ్లోసంపాదించిన సామాగ్రితో ఆబ్దీకం పెడుతు

నాడు. మట్టమధ్యాహ్నమైంది. భోక్తలువచ్చారు. స్నానా
లయ్యాయి. సోమయాజి స్నానంకూడా అయింది. **మడిపంచి**
దొడ్డోఆరవేసివుంది; కట్టుకోడానికి పెరట్లోకి వెళ్లాడు. ఆరిన
పంచికి నిప్పుముట్టిస్తూంది కూతురు. తనకుమార్తె తల్లితో
పాటు వంటసాయం చేయడం చూశాడు. అనుమానంలేదు.
పంచికి నిప్పుముట్టిస్తూన్న పిల్లనిచూస్తూ నిలువునా నీరువిడిచి
పోయాడు సోమయాజి. కళ్ళంట నీరు ఏగు లాపారుతూంది.
స్పృహలేదు. ఆ పిల్ల సోమయాజిని చూడలేదు. భోక్తలు
సోమయాజిని పిలిచారు. సోమయాజి దొడ్లోంచి రాలేదు.
ఏమిప్రమాదంజరిగిందో అని అందరూ దొడ్డిలోకి వెళ్లారు.
వంటవిడచి భార్యా,కూతురూకూడా పరుగెత్తారు. పంచిసగం
కాలింది. వాళ్లచప్పుడికీ, మాటలకీ పంచికాలుస్తూన్న పిల్ల
వెనక్కి తిరిగింది. నోట మాటలేక దుఃఖిస్తూన్న సోమయాజిని
చూసింది. ఏమీ మాట్లాడలేదు. ఆశ్చర్యంతో తక్కినవాళ్లు
సోమయాజి కూతురువేపుకీ, ఆ పిల్లవేపుకీ చూస్తున్నారు.
అచ్చంగా, మూడుమూర్తులా సోమయాజి కూతురులావుం
దాపిల్ల. ఇద్దరూ సమానపొడవూ, బలమూకలిగివున్నారు.
అవయవాలన్నీ వొకలావున్నాయి. కట్టుకొన్న బట్టలుకూడా
వాకేమోస్తరు. అందరూకళ్లువిడిచి నోటమాటలేక చూస్తు
న్నారు చిత్తరువుల్లాగ. సోమయాజి లోకాతీతమైన భక్తితో

సాష్టాంగపడి "తల్లీ! ఇంకామమ్మల్ని మట్టివేస్తావా? మా మీాదదయలేదా? పిల్లలుగలనన్ను రక్షింపవా? అపరాధాన్ని క్షమింపవా? మాకునీకంటే దైవతమేముందీ? అమ్మా! అమ్మా! అమ్మా!" అంటూ ఆపిల్లకాళ్లు పట్టుకొన్నాడు. పద్మాల చేతులతో సోమయాజిని స్పృశించి, ఆశీర్వాదించి మాయమయిందాపిల్ల.

# క వి

## ౧

ధారానగరం. రాత్రి పట్టపగల్లావుంది. పదిగంటలు వేశారు. కొంకణం నుంచి వచ్చినబాట సారులు పురసౌందర్యం చూస్తూ తిరుగుతున్నారు. నగరసౌందర్యం ఎంతసేపు చూసినా వారికి తనివి తీరడంలేదు. అంత అందంగా ఉం దానగరం. చాలా సేపు తిరిగితిరిగి పడుకోడానికి స్థలంకోసం చూస్తున్నారు. కొంత సేపటికి చలవరాళ్లతో కట్టబడి రంగురంగుల విద్యుద్దీపాలతో ప్రకాశిస్తూన్న మేడ కనపడింది. ఆ మేడ మైలువెడల్పూ, అంత పొడుగూవుంది. ఆ మేడకి నాలుగువేపులా 'బాటసారులసత్రం' 'బాటసారులసత్రం' అని వ్రాసివున్న పెద్దఅక్షరాలని చూశారు. మేడతలుపులు తెరచిఉన్నాయి. వీథిలో నరసంచారం లేదు. నిశ్శబ్దంగా వుంది. ఆ మేడలో పడుకోడానికి ఏభై మంది బాటసార్లూ వెళ్లారు. హంసతూలికా తల్పాలతో నిండివున్నాయి గదులు. కావలసిన సౌకర్యాలన్నీ అందులో వున్నాయి. మనుష్యులెవరూ లేరు. చాలా ధర్మాత్ముడని రాజుని పొగడుతూ తలుపులు వేసుకొని పడుకొన్నారు.

# దయ్యాలు

నడిరాత్రి. దీపాలన్నీ వొక్కసారి ఆరిపోయ్యాయి. దీపాలారి పోవడం బాటసార్లుకి తెలియదు. గాఢ నిద్రలో ఉన్నారు. పెద్ద పెద్ద కేకలు బయలుదేరాయి. ఆ బొబ్బలతో గొల్లుమంటూ లేచారు బాటసార్లు. మేడ కూలిపోయేటంత చప్పుడైంది. ఆ చీకట్లో పేరు పేరుపెట్టి పిలుచుకొంటున్నారు. భయంతో ఇటూ, అటూ తిరుగుతున్నారు. దెబ్బలు తగిలి బోర్లపడు తున్నారు. వారిలో వారు కొట్టుకోడానికి సిద్ధపడ్డారు దొంగ లనుకొని. మాటలు గుర్తించుకొని కలహం మానుకొంటు న్నారు. ఎక్కడినుంచో భయంకర కంఠంతో కొన్ని మాటలు వచ్చాయి. అవి విని నిశ్శబ్దంగా వున్నారు. మళ్లీ వచ్చాయి ఆమాటలే. వారికవి అర్థం కాలేదు. దీపాలు వెలిగాయి. మహాపర్వతంలా బ్రహ్మరాక్షసి వారి కెదురుగా నిలుచుంది. వారికి స్పృహ తప్పింది. భయంచేత కొందరు మరణించారు. కొందరు పారిపోడానికి చూశారు. కాళ్లాడక అక్కడే పడి మరణించారు కొందరు. కొందరెల్లావుంటే అల్లాగే ప్రాణాలు విడిచారు. బ్రతికి ధైర్యంగా వున్న వాళ్లని బ్రహ్మరాక్షసి చంపుకొని తినేసింది. మేడంతా ఎముకలతో రక్తంతో నిండి పోయింది.—

తెల్లవారింది. కాకులు కూస్తున్నాయి. రాజభటులు తొందరగా ఆ మేడకి వచ్చారు. అల్లరిబిల్లరిగా పడివున్న పచ్చిఎము

కల్ని చూశారు. గోడలు రక్తంతో నిండివున్నాయి. గోడల మీాద భయంకరమైన చేతిగుర్తులున్నాయి. అదంతా చూసి రాజభటులు చాలా సేపు విచారించారు. జరిగిన సంగతి తొందరగా రాజుకి నివేదించారు. 'స్వామీ! మొన్న నేలాగో మా ప్రాణాలు దక్కించుకొన్నాము. బాటసారులు ఏలిక మందిరంలో ప్రవేశించడం దూరంనుంచి రహస్యంగా చూశాం. బ్రతికిన వాడు లేడు.' అన్నారు. రాజు వెంటనే ఆ ఘోరంచూసిదుఃఖించాడు. కోట్లకొలదీ కర్చుపెట్టిన భవనములో చావులూ, నాటి దృశ్యం అతని హృదయాన్ని కలవరపెట్టాయి. నాటినుండీ దేశదేశాలనుండి మంత్రవేత్తల్ని రప్పించి తగినపని చేయించడమూ, అభిచారికా హోమాలు చేయించడమూ మొదలుపెట్టాడు రాజు. మాంత్రికులనే తినేసింది బ్రహ్మరాక్షసి. రాత్రి మంత్రోచ్చాటనకి కూర్చున్నవాడు కనిపించడం లేదు. చాలామంది మంత్రవేత్తలు హాతమయ్యారు. మంత్రాలూ, తంత్రాలూ ఆ రాక్షసిముందు పనిచేయలేదు. రాజుకి బెంగ అధికమైంది. నిత్యమూ మందిరంలో చావులు తప్పడంలేదు. విచారంవల్ల రాజు సభకు రావడం మానుకొన్నాడు.

రాజు విచారానికి కారణం గ్రహించి ఆస్థానకవి రాజుని సమీాపించి బ్రహ్మరాక్షసిని తొలగిస్తానని ప్రతిజ్ఞపట్టాడు. కవి ప్రతిజ్ఞకి రాజు తహ తహలాడాడు. "కవి లేనిదేశం నిర్భాగ్య

దేశం. కవి లేకపోతే ఆ దేశానికీ, రాజుకీ కీర్తి లేదు. కవి లేకపోవడం సూర్యుడు లేకపోవడం వంటిది. కవి ఉదయము సూర్యోదయము. నా దేశమంతా పాడైపోయినా, నేనూ, నా ప్రజలూ కవిని విడువలేము." నీ వామందిరానికి పోవద్దని ప్రార్థించాడు కవిని. "నా కేమీ భయంలేదు. నేను మరణించను. బ్రహ్మరాక్షసిని ఈ రాత్రే తొలగించి ఉదయాన్నే సంతోషంగా వస్తాన"ని అనేకవిధాలా రాజుని వొప్పించి నూత్న మందిరంలో ప్రవేశించాడు కవి. అతనికి తొలిఝామునే గాఢనిద్ర పట్టింది. మందిరమంతా గాఢాంధకారమయింది. పెను ప్రళయంలా గాలి వీచింది. తరువాత పెద్దధ్వనీ. కేకలూ, కూతలూ వచ్చాయి. ఆ ధ్వనులికి ధైర్యంగా లేచి కూర్చున్నాడు కవి. వరసగా నాలుగుఝాముల్నీ నాలుగు మాటలూ వినిపించాయి. అవి పాణిన్యాచార్యునిసూత్రాలు—

౧. వ. ఝా. ప్రశ్న—సర్వస్య ద్వే—

జవాబు—సుమతి, కుమతీ సంపదాపత్తిహేతు.

౨. వ. ఝా. ప్రశ్న—వృద్ధోయూనా—

జవాబు—సహాపరిచయాత్త్యాజ్య తే కామినీభిః

3. వ ఝా. ప్రశ్న—ఏకోగోత్రే—

జవాబు—ప్రభవతి పుమాన్యః కుటుంబం బిభర్తి

౪. వ ఝూ. ప్రశ్న—స్త్రీ పుంవచ్చ—
జవాబు—ప్రభవతి గృహే తస్య గేహం వినష్టం.

[౧. సర్వజనానికీ సుబుద్ధీ, దుర్బుద్ధులు—సంప దాపత్తులకు కారణాలు.

౨. వృద్ధుడు యౌవన స్త్రీలచే విడువ పడతాడు.

౩. ఏపురుషుడు వంశాన్ని పోషించునో, వాడే సమర్థుడు.

౪. ఆడది మొగాడిలా ఏ ఇంటిలో సమర్థమౌనో ఆ ఇల్లు పాడై పోతుంది.]

అని వరసగా వచ్చిన ప్రశ్నలవి. సమాధానం చెప్పాడుకవి. ప్రశ్న ప్రశ్నకీ సమాధానం రావడంచేత మొదట బ్రహ్మరాక్షసి కనిపించలేదు. ఆఖరి జవాబుతో ప్రత్యక్షమైంది—దివ్య మంగళరూపంతో. ఆశ్చర్యంతో కవి "నీవెవ్వరు? నీవృత్తాంతమేమి?" టని అడిగాడు. అప్పుడా నూతన పురుషుడు. పూర్వవృత్తాంతం జ్ఞప్తికి తెచ్చుకొని "నేను గొప్ప పండితుణ్ణి. నాదగ్గిరవున్న విద్య ఎవరికీ చెప్పలేదు. ఓ విద్వాంసుడు విద్యాదానం చేయుమని కోరాడు. విద్యాదానం చేయక పోవడమే కాకుండా అతణ్ణి తిట్టి తగిలాను. నాపని కాత డుగ్రుడై 'బ్రహ్మరాక్షసివి కమ్మ'ని ఘోరశాపం పెట్టాడు. భయంతో మ్రొక్కి శాపాంతం కోరాను. ఆదయామయుడు పాణిని సూత్రాలు



నాలుగుఇచ్చి వీనికెవ్వడు జవాబు చెపుతాడో వాని వల్ల నీ బ్రహ్మరాక్షసత్వం పోతుందని చెప్పాడు. అల్లాగే బ్రహ్మ రాక్షసినై ఈ భవనంలో ప్రవేశించి చాలామందిని చంపి తిన్నాను. ఈ వేళ నీవల్ల శాపవిముక్తి కలిగిందని అంతర్ధాన మైనాడు సూత్న పురుషుడు.

కోరివి

౯

తొలకరించింది. అప్పుడప్పుడు వాన దట్టంగా కురిసి మానే స్తోంది. ఉభాలు ప్రారంభించారు. ఆ రోజుల్లో చీకటిరాత్రుల్లో కూడా సామాన్యంగా ప్రతీరైతూ పొలాలు చూసుకోడానికీ, పశువుల్ని చూసుకోడానికీ కమతంలోకి వెడుతూ వుంటాడు.

నా డమావాస్యా. చినుకుపడి చీదరగా వుంది. సాయం త్రంనుండీ చిన్నతుపారంలా చినుకులు రాలుతూనే ఉన్నాయి.

వెంకయ్య మంచి నడియవ్వనంలో వున్న కాపుబిడ్డ. అతని పొలం వూరికి బైటే కాలవ అవతల తూర్పుగా వుంది. ఊరికీ ఆ పొలానికీ మధ్యగావుంది శ్మశానం. శ్మశానం నిండా తుమ్మలు దట్టంగా పెరిగివున్నాయి. వెంకయ్య పొలం వెళ్లా లంటే శ్మశానంలోంచే వెళ్లాలి. మరోదారి లేదు. నడిరాత్రి అతను పొలానికి బయలుదేరాడు. ఊరుబయటికి వచ్చాడు, దారి అవుపించలేదు. మెరుపుల సహాయంతో దారి తప్ప కుండా నడుస్తున్నాడు. కన్నూ కన్నూ కనిపించడం లేదు. నక్కకూతలే కాని మనిషి సడిలేదు. తుమ్మల్లో దివిటీల

వెలుగు కనపడుతూంది. ఆ దివిటీలు ఆరిపోతూ వుండడమూ వెలుగుతూ వుండడమూ కళ్లారా చూస్తున్నాడు వెంకయ్య. తుమ్మల్లోకి చేరాడు. అక్కడికి ఇంకా ముందున్నట్టు కన పడ్డాయి దీపాలు. తనకా దీపాలు వుపయోగపడలేదు. తన పాలేర్లు దీపాలు పట్టుకొని తిరుగుతూన్నారేమో అని పేరు పేరుపెట్టి పిలిచాడు. జవాబులేదు. వల్లకాడూ, కాలవా దాటి పొలం చేరుకొన్నాడు. పాలేర్లు లేరు అక్కడ. దీపా లింకా ముందున్నట్టు కనిపించాయి. పొలమంతా ఓసారి తిరిగి వచ్చి చుట్టకాల్చుకొని అరపమీది కెక్కి పక్కవేశాడు. నిద్ర పట్టలేదు. లేచి కూర్చున్నాడు. క్రిందికి దిగి పశువులుకి గడ్డి వేశాడు. చుట్టూ దీపాలు వందలకొలదీ దూర దూరంగా కనిపిస్తున్నాయి. పొలాల కాపులు చలిమంటలు వేసుకొంటు న్నారో? తుంటలు ముట్టించి చేలకి నీరుపెట్టుకోడానికి తిరుగు తున్నారో? అనుకొన్నాడు. అరపమీది పాకలో పడుకొ న్నాడు. నిద్ర పట్టింది గాఢంగా.

చినుకులు మొహం మీద పడగానే చటాల్ను లేచాడు. కళ్లువిప్పి చూశాడు. తాను మూలచింతక్రింద పడుకొని ఉండ డం గ్రహించాడు. అరపకి మైలుదూరంలో వుందా మూల చింత. ఇక్కడికి కెల్లా వచ్చానా? అనుకొన్నాడు. దిక్కులు పరికిం చాడు. ఎదురుగా కాగడా చేతిలోవున్న నల్లనివ్యక్తి కనుపిం

చింది. దానికి మడమలు ముందుకున్నాయి. ముఖం వీపు వేపుకి వుంది. వీపు ముందుకివుంది. శరీరంమీద మాంసం లేదు. కళ్లు లోతుకి వున్నాయి. సన్నంగా వుందావ్యక్తి. నెత్తి మీద టోపీలాగ చింపిరిజుత్తు బారెడు వుంది. ఆ వ్యక్తిని చూసి చూసి వెంకయ్య కెవ్వుమన్నాడు. వ్యక్తి హఠాత్తుగా మాయమైంది. వెనకకు చూశాడు. పది బారల దూరంలో అది ప్రత్యక్షం! పాలేరు మారువేషంతో వచ్చి హాస్యాలాడు తున్నాడా? 'ఏమిరా సుబ్బా! ఏమిటిరా ఇదంతానూ?' అన్నాడు. జవాబులేదు. పక్కలో కర్రకోసం తడివాడు. దొరకలేదు. ఏమీ పాలుపోక, ముందుకి నడిచాడు. వెనక వున్న కాగడా తనకంటె ముందు నడవడం ప్రారంభించింది. ఈ విధంగా ఏ దిక్కు తిరిగినా ముందు కాగడా, వెనక వెంక య్యాను.

తెల్లవారింది. ఊరికి వుత్తరంగావున్న పెద్ద మైదానంలో తిరుగుతున్నాడు. కళ్లువిప్పాడో, తెరిచాడో అతనికి తెలియదు. పొలాలనుండి వచ్చేవాళ్లూ, పొలాలు వెళ్లేవాళ్లూ, అక్కడి కక్కడే తిరుగుతూన్న వెంకయ్యని పలకరించారు. అతనికి చైతన్యం లేదు. నలుగురూ అతణ్ణి కూర్చోబెట్టి ఉపచారాలు చేశారు. కళ్లువిప్పాడు. దిగ్గునలేచి దూరంగా కూర్చున్నాడు. తనపొలం విడిచి వుత్తరం వేపుకి ఎల్లావచ్చానా? అని సందే

హించాడు. భయం పుట్టింది. వారికి రాత్రి జరిగిందంతా చెప్పాడు. "అయ్యా బాబోయ్!' అది కొరివిదయ్యంరా" అన్నారు వాళ్లు. ఆ మాటలు సరిగ్గా విన్నాడో లేదో అతను మూర్ఛపోయాడు. శరీరం వొకేవిధంగా వొణుకుతోంది. వేడెక్కిపోయింది వొళ్లు. వేడిగా జ్వాలలు వస్తున్నాయి ముక్కునుండి. వెంకయ్యకి స్పృహతప్పింది పూర్తిగా. చేతుల మీాద ఇంటికి తీసుకుపోయారు.

మరి నాలుగురోజు లున్నాడు మంచంమీాద వెంకయ్య అంతే—

# రాజమ్మ

## ౧౦

" భవతి భిక్షాం దేహి ! "

"............... "

" భవతి భిక్షాం దేహి ! "

"............... "

" భవతి భిక్షాం దేహి ! "

"............... "

" జయ్ సీతారామ్ ! "

"............... "

" జయ్ సీతారామ్ ! "

"............... "

" జయ్—సీతా—రామ్ ! "

" బైరాగిలా ఉన్నాడత్తయ్యా ! "

" ఎక్కడా ?... "

" వీథిగుమ్మంలో. "

# ద య్యా లు

“గుప్పెడు గింజలు పడెయ్యి.”

“ఎవరేనా ఉంటారేమో?”

“అబ్బాయి అరుగుమీద లేడూ?”

“పొలం వెళ్లారు.”

“జయ్ సీతారామ్!”

“అదుగో అత్తయ్యా!”

“వీథిలోకి వెళ్లకుండా వెయ్యవే...”

“శరభన్నమామ అరుగుమీదే వుంటాడు.”

“తలుపు వేసి వుందా?”

“ఊఁ”

“వాడే పోతాడులే.”

“జయ్ సీతారామ్!”

“అదుగో అత్తయ్యా!”

“అరిచి అరిచి వాడేపోతాడు వూరుకో.”

“జయ్ సీతారామ్!”

“అదిగో! గట్టిగా అరుస్తున్నాడు.”

“..............”

“అత్తయ్యా!...”

“ఏవమ్మా! చిట్టితల్లీ!”

“జయ్ సీతా—రామ్!”

"అదిగో! కేక చూశావా?

"వేసుకోనీ."

"వారమయింది రోజూ వస్తున్నా డత్తయ్యా!"

"అలాగుటమ్మా! ఎవరు వేస్తున్నారు వాడికి ముష్టి?"

"అచ్చి—రోజూ వేస్తోంది."

"జయ్ సీతారామ్!"

"అదిగో! మళ్లీ...చూడు—అత్తయ్యా."

"ఓనాడు వేయకపోతే మరేమీ ఫరవాలేదు—అరుచుకోనీ."

"అదిగో! శంఖం వూత్తున్నాడు!"

"ఏం వమ్మా! వాడికి భయపడతావూ?"

"బైరాగులు మంచివాళ్లు కా రత్తయ్యా!"

"మనని ఏమి చేస్తాడూ?"

"కాదు—ఏమీ చెయ్యడులే. మాటవరుస కన్నాను."

"..............."

"అదిగో! గంటలచప్పుడు. పోడేమీ అత్తయ్యా!"

"రోజూ ముష్టి మరిగాడు పోతాడటమ్మా!"

"అసలు ముష్టి వెయ్యకుండా వుండవలసింది."

"ఆపని చేస్తే—ఇన్నాళ్లు వచ్చునా?"

"పొరపాటే అయింది. మామోలు బైరాగిలాంటివా డనుకొని లోపలే వుండి అచ్చిచేత ముష్టి వేయించేదాన్ని."

"జయ్ సీతారామ్ !"

"అదిగో !......"

"నువ్విల్లా రా ! ఎందుకల్లా భయపడుతున్నా వమ్మా! ఎన్నడూ లేంది ; ఎవరేనా వింటే నవ్వుతారు, పిల్లతల్లివి. ఇంతకీ తలుపులు వేసి వున్నాయిగా !"

"లేదత్తయ్యా ! మరీ—చూడూ—మరేమోనే..."

"ఏమిటమ్మా! ఆతొట్రుపాటు? వెర్రిదానిలా వున్నావు."

"మొన్న కళ్లెర్రచేసి చూశాడు. ఆవేళ తలనొప్పి వచ్చిం దనీ."

"వాడిమొహం పోసిలేస్తూ."

"జయ్ సీతారామ్ !"

"మళ్లీ......చూశావా ?"

"..............."

"ఊళ్లో ముష్టెత్తడు కామోసు !"

"చెయ్యి వూరుకోలేదు వెళ్లవోయ్ !"

"జయ్ సీతారామ్ !"

"వెళ్లూ......"

"జయ్ సీతారామ్ !"

"ఈవేళకి వెళ్లాలి!"

"వాడిమాట వినిపిస్తేనే తలనొప్పి అత్తయ్యా!"

"దుర్మార్గుడులా వున్నాడు."

"..............."

"భిక్షం!"

"లేదు—వెళ్లా—"

"భిక్షం..."

"తలుపుతీసి చెపితేనే కాని వెళ్లేటట్టు లేదే పీడిమొహం యీడ్చా!"

"వెళ్లడు."

"ఎల్లావెళ్లడో చూస్తానుండు."

"భయం వేస్తుంది వాణ్ణిచూస్తే."

"భయంలేదు—గియంలేదు ఉండు చెప్తాను."

"తలుపు తియ్యకు అత్తయ్యా!"

"ఫరవాలేదు. నన్నేమిచేస్తాడు వాడిమొహం?"

"ఓయ్! నీకు చెపితే—బుద్ధిలేదూ! వెళ్లమంటూంటే—ఆ కేకలేమిటి? పో—మడికట్టుకొన్నాను. వేసేవాళ్లు లేరు ముష్టి!"

"పిడికెడు—మాతాజీ!"

"ఎల్లా వస్తాయి?"

"కోడలమ్మాయి."

“ వెయ్యేదు. వెళ్లు!”

“ జయ్ సీతారామ్!”

“ ఇక్కడ కేకలెయ్యకు.”

“ పట్టె డన్నం మాతాజీ!”

“ మా అబ్బాయి రానీ; వచ్చే వేళైంది.”

“ జయ్ సీతారామ్!”

“ అన్నం పెడతానన్నావేమిటి అత్తయ్యా!”

“ వాణ్ణి చూస్తే జాలివేస్తోంది. అబ్బాయి వచ్చాక పెట్టమంటే పెడదాం.”

“ ఇంట్లో పెడతావా?”

“ ఇంట్లో ఎందుకమ్మా! వీధిలో పడేస్తే, తినిపోతాడు.”

“ వికారంగావుంది అత్తయ్యా!

“ పైత్యాధికంగా వున్నట్టుంది, వెళ్లి పడుకో. వంటైంది. అబ్బాయిరాగానే లేపుతాను. కాస్త చింతపండూ, ఉప్పూ నోట్లో వేసుకో.”

౨

“ ఎక్కడికి రమ్మన్నావు? ఎందుకూ?”

“ . . . . . . . . . . . . . . ”

“ ఎంతదూరం రమ్మన్నావోయ్?”

"...............‟

"ఎందుకో చెప్పూ."

"..............."

"పన్నెండైంది. ఆకలేస్తోంది. ఎందాకా?"

"ఈచెట్ల చాటుకే.‟

"అల్లా చెప్పకూడదూ, మాట్లాడకుండా లాక్కుపోతావేం?‟

"కూర్చో నీకు లాభించే మంత్రం చెప్తా.‟

"చెయ్యి చూడు.‟

"చెయ్యి చూడడం కాదు.‟

"భోజనం కావాలా?‟

"కావాలి.‟

"ఈవేళ మాయింటిదగ్గిరే వుండండి.‟

"నీభార్యా! అన్నం పెట్టదు.‟

"నే పెట్టమంటే, ఎందుకు పెట్టదు?‟

"పెట్టదు; తగిలేస్తుంది.‟

"అల్లాంటిదే కాని, నే పెట్టిస్తాను.‟

"సరే; ఆవిడిచేతనే వడ్డింపిస్తావా?‟

"ఆహా!‟

"నీకెన్నాళ్లై పెళ్లైంది?‟

“దశ దాటింది.”

“ఆపిల్ల కెన్నేళ్లుండగా పెళ్లాడావ్రూ?”

“పది.”

“నీభార్యా, ఎప్పుడేనా దేవాలయానికి వెళ్లిందీ?”

“నీకదంతా ఎందుకుస్వామీ!”

“కావాలి. నాప్రశ్నలికి సమాధానం చెపితే మేలు కలుగుతుంది. వెడుతోందా?”

“ఎప్పుడూ వెళ్లలేదు.”

“ఇంట్లో దేవుడు పీఠం లేదూ?”

“నాభార్య వచ్చినప్పటినుంచీ లేదు.”

“ఏమైంది?”

“మాయమైంది. ఎందుకల్లా అడుగుతున్నారు స్వామీ!”

“మాట్లాడకు, తర్వాత చెప్తాను.”

“భోజనానికి వేళ మించుతోంది, ఇంట్లో కనిపెట్టుకువుంటారు. వెడదాం.”

“నీభార్యా సంగతులు దాపరికం లేకుండా చెపుతానంటే మీయింటికి భిక్షానికి వస్తాను. లేకపోతే రాను.”

“ఏమి చెప్పమన్నారు?”

“చెపుతానను.”

"తమలాంటి యతులదగ్గిరా దాపరికం? సర్వజ్ఞులు. తమకు తెలియని సంగతులుంటాయా? నాలాంటి సంసార్లని వుద్ధరించ డానికి వస్తారు ఎప్పుడో. మీదగ్గిర రహస్యాలు దాగుతాయా? దాస్తే తెలియదా? తప్పకుండా తమ కోరిక నెరవేరుస్తాను దయచేయండి."

"విషమప్రశ్నలు వెయ్యను. అబద్ధమాడితే తల పగులు తుంది!"

"చిత్తం."

"నీభార్యను విడిచి వుండగలవా?"

"ఒక్క నిమిషమేనా వుండలేను."

"విడవవలసి వస్తుంది. మరే మంటావు?"

"అమ్మో......"

"అదిగో......"

"నిజం స్వామీ!"

"విడవాలి; జాగ్రత్త!"

"అల్లాగాండీ?"

"మనమాటలు ఇంట్లో చెప్పకు, రెండో కంటికి తెలియ నీయకు."

"చిత్తం; ఆజ్ఞ. మాకు వియోగం సంభవిస్తుందంటారా? ఎన్నాళ్లలో స్వామీ!"

"ఈవేళో? రేపో?"

"వియోగం భరించలేను స్వామీ! మీ మాటలు విన లేకుండా కూడా వున్నాను."

"................"

"మీ చూపులతో...నా మనస్సు తిరుగుతోంది. అల్లా చూడకండి."

"నీ భార్య రోజూ అన్నం తింటోందా?"

"తినకేమి స్వామీ! తింటోంది. మా అందరి భోజనాలూ అయినతర్వాత చుట్టాలు వచ్చినాసరే; అందరిలోనూ తింటే సయించదని తలుపులు వేసుకొని తింటుంది. అది దానికి పదేళ్ల నుంచీ నీమం."

"ఇప్పుడు మనం ఇంటికి వెళ్లేటప్పటికి తలనొప్పితో పడు కొని వుంటుంది. లేపకు. నేను భోజనం చేసి వెళ్లి వూరుబైట పెద్ద రావిచెట్టుక్రింద గుడిలో వుంటాను. నేను వెళ్లగానే నా కెందుకు అన్నం పెట్టాలని కోప్పడి తిడుతుంది. ఏమీ అనకు. నీ భార్యా తలుపు వేసుకొని అన్నం తినేటప్పుడు తలుపుకన్నం లోంచి సడిలేకుండా ఏం చేస్తోందో చూడు. వచ్చి వెంటనే నాకుచెప్పు. రెండురోజులు ఇల్లువిడిచి ఎక్కడికీ వెళ్లకు. ఏం పనివున్నా ఎవరికేనా ఔత్తాయించు. ఆమె వెనకాతలే అతి ప్రేమగా తిరుగుతూవుండు. ఇదే నీకు చెప్పడం. ఇందులో ఏం

మరిచిపోయావా, కొంప మునుగుతుంది. ఆమె ఏమి చెపితే అది చేస్తూవుండు."

"మొలకి కట్టినరక్ష వుంచమన్నారా?"

"అది వుండితీరాలి."

3

"జయ్ సీతారామ్!"

"నమస్కారం స్వామీ!"

"శుభో జయం. ఏమిజరిగింది? వేగిరం చెప్పు. భయం లేదు."

"మీ రన్నట్టే; నిద్రలేపగానే ఎన్నడూ తిట్లెరగనిది తిట్టి కొట్టినంత పనిచేసింది. కోపంతో ఉన్న ఆ స్వరూపం ఎప్పుడూ చూడలేదు. అంత రౌద్రరూపం దాల్చింది. మా అమ్మకూడా ఆశ్చర్యపడింది. తలుపుకన్నం లోంచి చూశాను. నడికొప్పుని అంటుతూ భయంకరాకారంతో గదిలో ఓ వ్యక్తి కనిపించింది. చూడలేక చూడలేక చూశాను. రెండుకోళ్లని తింటోందా వ్యక్తి. గదిలో నా భార్యా కనిపించలేదు. కోళ్లనెవళ్లో ఎత్తుకుపోతున్నారని కోళ్లవాళ్లు వీథిలో పరుగెత్తుతున్నారు. ఎప్పుడూ అలవాటే అల్లా కోళ్లూ, పందివిల్లలూ పోవడం. ఆ

గోలతో నా భార్యా పైకి వచ్చింది. ఇంట్లో వాటిని ఎవరు తిన్నారో? తిన్నగుర్తులేనా కనపడలేదు. నాకు చాలా భయంగా వుంది స్వామీ!"

"మీ ఇంటిలో శాకినీ వుంది. నేను పోగొడతాను. చెప్పినట్లు విని చేస్తావా?"

"వినకేమి స్వామీ! తప్పక వింటాను; చేస్తాను. ఆ శాకినీ నా భార్యనిపట్టి వుందంటారా?"

"..............."

"ఆలోచిస్తున్నారు?"

"అల్లాగే—"

"నా భార్యదగ్గిర ఆ చేష్టలేమీ లేవు."

"ఉండవు; ఇంట్లో వుంది."

"మా అమ్మకీ నాకూ అనుమానం వుంది. మా చేతిలో డబ్బు లేకపోతే ఆ రాత్రి కావలసిన డబ్బు, ఒక్కొక్కప్పుడు రెట్టింపూ, తలక్రింద వుండడం: మిగిలిపోయినడబ్బు మాయమవ్వడం: ఒక్కొక్కప్పుడు అపూర్వసువాసనలు ఇల్లంతా వ్యాపించడం: ఇంటికి చుట్టాలొస్తే వాళ్లకి కలలో కనపడి అల్లరిపెట్టడం:—ఇల్లాంటివి తరుచు జరుగుతున్నాయి. ఈ సంగతి వూళ్లోనూ, పైకీ చాలామట్టుకి వ్యాపించింది. కొందరు ఇంట్లో దయ్యముం దన్నారు. జరిగినవీ, జరుగుతూన్నవీ సంగ

తులు మేం చెప్పుకుంటూంటే. నా భార్యా భయంచేత మతి పోయి పడిపోవడం జరుగుతూంది. మా కేమీ భయం లేదు. మొన్నవచ్చిన చుట్టాన్ని అర్ధరాత్రి శ్మశానంలో మర్రిక్రింద పడుకో పెట్టింది. నాకు అప్పుడప్పుడు విపరీతమైన కలలువస్తాయి. భార్యతో సముద్రాలమీదా, కొండలమీదా, మహాక శ్యాల్లో, చెట్లచివరనుంచీ, కొండగుహల్లోంచీ ఎగిరిపోతూ హాయిగా సంచరిస్తూ వున్నట్టు స్వప్నాలొస్తాయి. నా భార్యా రూపంతో మా అమ్మ గుండెలమీద కూర్చొని అల్లరి చేయడం, మొదలైనవి జరుగుతూ ఉంటాయి."

"అవన్నీ శాకినీ చేస్తూన్న పనులే, అనుమానంలేదు."

"ఐతే; అది తొలగే పనిచేయండి నేనన్నీ సిద్ధం చేస్తాను."

"ఏం ప్రమాదాలొచ్చినా ఆ భూతాన్ని పోగొట్టుమనేనా నీవుద్దేశ్యం?"

"ఔను స్వామీ!"

"ఐతే; ఈ రేకులు మూడూ తీసుకో. వీథిగుమ్మానికీ, దొడ్డిగుమ్మానికీ, నడికొప్పుకీ ఎవరూచూడకుండా కట్టు. రేపు రాత్రి దాన్ని తొలగిస్తాను. ఊళ్లో పెద్ద లందరినీ రేపు రాత్రి రమ్మను. వారిని రహస్యంగా పిలు. ఈ వేళకి నే చెప్పినట్టు ఆ రేకులు జాగ్రత్తగా కట్టు. నిమిషాలమీద ఎవరికీ ప్రమాదం లేకుండా భూతాన్ని పోగొడతాను."

## ద య్యా లు

*  *  *  *  *

*  *  *  *  *

"మీరు చెప్పిన సామగ్రి జతపరచాను. ఏదీ లోటులేదు. అందరూ వస్తారు. మా అత్తవారు కూడా వచ్చారు. తమరు నట్టివాకిట్లో పని ప్రారంభింపవచ్చును. నాభార్యా తలనొప్పితో పడుకొంది. చాలాకోపంతో వుంది. కారణం తెలియదు. ఆవదం దీపాలే పెట్టించాను. ప్రయత్నలోపం లేదు."

"ఈరక్ష నీవు కట్టుకో. ఇది మీ అమ్మని కట్టుకోమను. మీపిల్లవాడి కిది కట్టు. కుర్రవాణ్ణి పొరుగింట అప్పగించు. మంచాలదగ్గరనుంచీ ఇంట్లో సామానులు పొరుగున జాగ్రత్త పెట్టు." యతి నడివాకిట్లోకివచ్చాడు. గదిలో అరసవిల్లి పెళ్లాం రుసరుసలాడి గర్జించింది. వూళ్లోజనం అరసవిల్లింటిలోనే వున్నారు. నిశ్శబ్దంగావుంది. అందరూ యతి ఏంచేస్తాడో అని చూస్తున్నారు. పిండితో రంగు రంగుల పట్టువేశాడు యతి. రాజమ్మ తల్లీ, తండ్రీ కూతురున్న గదిలోకి వెళ్లడానికి లేచారు. యతి వెళ్లొద్దన్నాడు. మంత్రోచ్చారణ ప్రారంభించాడు యతి. అక్కడ కావలసిన కలశాలూ, కుంభాలూ వగైరా ఎక్కడెక్కడ వుండాలో అక్కడక్కడ భద్రపరచాడు. అరసవిల్లిని దూరంగా పొమ్మన్నాడు యతి.

# రాజమ్మ

గది తలుపులు బిగించుకొంది రాజమ్మ. గదిలోంచి రోదనాలు బయలుదేరాయి. ఉచ్చైస్స్వరాలతో మంత్రోచ్చాటన చేస్తున్నాడు యతి. రాజమ్మ తలి తండ్రులికీ, అత్తకీ, భర్తకీ ఆ రోదన వినడం చాలా కష్టంగావుంది. ఝామురాత్రి అయింది. మంత్రోచ్చారణ ప్రతిధ్వనిస్తోంది. గదిలో రాజమ్మ కేకలే వినిపిస్తున్నాయి. మంత్రాల ప్రతిధ్వనీ, రాజమ్మ కేకలూ విని భయంవేసి అక్కడున్న ఆడవాళ్లూ, పిల్లలూ, పిరికివాళ్లూ వెళ్లిపోయారు. ఊళ్లో ఎవరికీ నిద్రలేదు, ఏం జరుగుతుందో చూద్దామని కూర్చున్నారు. ధైర్యంకలవాళ్లు మాత్రం అరస విల్లి ఇంట్లో వున్నారు. గదిలో కేకలు భూనభోంతరాళాలు ముట్టుతున్నాయి. ఇంటి నడికొప్పు ఫెళఫెళా విరిచేసింది రాజమ్మ. చీపురుపుడకేనా ఎవరిమీాదా పడలేదు. అప్పుడు ధైర్యం గలవాళ్లకి కూడా భయంవేసింది. యతి మంత్రాలతో హుం, ఫట్, ఓం అనే బీజాక్షరాలతో వొక మహానాదం బయలుదేరింది. ఆ నాదానికి తెగూ, తెంపూలేదు. గదిలోంచి "చంపేస్తాను!" "తినేస్తాను!" అన్న కేకలు వస్తున్నాయి జోరుగా. ఎవరిని చంపుతుందో ఏమిటో? పీటతో సహా యతి పైకి లేవడం చూశారు. కుంభాలూ, దీపాలూ అక్కడున్నవి పైకి ఎగురుతూన్నాయి. యతి కళ్లు మూసికొని ఏకాగ్రంగా మంత్రోచ్చారణ చేస్తున్నాడు. కొంతసేపటికి యతీ,

కుంభాలూ, దీపాలూ లేవడం, ఎగరడం తగ్గాయి. గదిలో సింహనాదాలు పుట్టాయి. ఆ నాదాలికి వూరంతా అదిరిపోతూంది. పశువులు కట్రాళ్లూడ పెరుక్కొని పారిపోతున్నాయి. కోళ్లూ, పిట్టలూ, పందులూ మొదలైనవి భయంవల్ల మతిపోయి గిరగిరా తిరుగుతున్నాయి. ఊరంతా గాఢాంధకారం. అమావాస్య అవటం చేత కంటికి మన్నూ మిన్నూ తెలియడం లేదు. రెండుఝాములు అయింది. యతి మంత్రాలే వినపడుతున్నాయి. రాజమ్మ కేకలు తగ్గాయి. రెండు ఝాములూ దాటాయి. యతి ఆహ్వాయమంత్రాలు మొదలు పెట్టాడు. రాజమ్మగది తలుపులు విడ్డాయి.

రాజమ్మ కొంతసేపటికి గుమ్మం దాటివచ్చింది. పైట కొంగు నడుముకుచుట్టి బిగించుకొంది. కుచ్చిళ్లు గోచీపెట్టింది. వీరాంగనలా ఉంది రాజమ్మ. ఆ పాదమస్తకమూ వ్రేలాడుతూన్నాయి శిరోజాలు. ఆ నల్లని శిరోజాలు చిందరవందరగా ఉన్నాయి. నగలేమీలేవు. శరీరం తళతళా గులాబీరంగులా ఉన్నది; కందిపోయి మెరుస్తూంది. గుమ్మం దాటివస్తూవున్న రాజమ్మని అందరూ వొక్కసారి చూశారు. పళ్లు పటాపటా కొరుకుతూంది ఆమె. మొగాళ్లెవరూ రాజమ్మని పదేళ్లై ఎప్పుడూ చూడలేదు. అప్పుడుచూసి ఆశ్చర్యపోయారు ఆమె సౌందర్యానికి. తల్లిదండ్రులూ, భర్తా, ఆమెరూపంచూసి గొల్లు

మన్నారు. ఆమె కవేమీ వినిపించలేదు. ఆమెనే(త్రాలు చింత నిప్పుల్లా ఉన్నాయి. తిన్నగావచ్చి యతివేసిన పట్టులో నిలుచుంది. యతిని కాల్చేసేటట్టు చూస్తోంది. రాజమ్మ మును పటికంటే పొడుగ్గా కనిపించింది. ఉ(ద్రేకంతో భార్యని గట్టిగా పిలిచి మూర్ఛపోయాడు అరసవిల్లి. ఆమె చూడలేదు. యతి నే(త్రాలు విప్పాడు. అక్షతలూ, నీళ్లూ మం(త్రించి రాజమ్మమీద చల్లాడు. మం(త్రోదకం పడగానే లోకం పగిలిపోయేటంత నవ్వు నవ్వింది రాజమ్మ. "నీ వెవ్వరు?" "నీ పూర్వవృత్తాంతం పూర్తిగా చెప్పు" అన్నాడు యతి—

"జమీందారు పిల్లను. జాతికి పెరికీదాన్ని. నన్నుమళ్లీ జమీందారుకే పెళ్లిచేశారు ముప్పైయేళ్ల వయస్సులో. ఆయన చాలా (క్రూరుడు. నా కతనిమీద ఇష్టం లేకపోయినా విధిలేక కారణాంతరాలవల్ల అతనికి నన్నిచ్చి వివాహం చేశారు. అతని కప్పటికి పదిహేనుమంది భార్యలు. వారేకాదు; విలాసినులు చాలామంది వున్నారు. నా వివాహ మతివైభవంగా జరిగింది. కొన్ని(గ్రామాలు హారణమిచ్చాడు నా తం(డ్రి. కులాచార(ప్రకారం. భర్తగృహంలోనే పునస్సంధానము నిశ్చయమైంది. నాడు ఆ (ప్రభువు నన్ను పలుకరించనే లేదు. ఉ(గుడై లేచిపోయాడు నిమిషంలో. ఆయన్ని అప్పుడుచూసిన జ్ఞప్తి కూడా లేదు. తిరిగి ఏడాదికి వారిదర్శనమైంది. ఆ రోజున నా

[illegible]డ కాయన వస్తానని చెప్పకే వచ్చాడు. నా డాయన్ని పలు
కరిద్దామను కొన్నాను. ఆయన మందిరంలో ప్రవేశించగానే
దేవోపచారాలు చేశాను సంతోషంతో. నా పరిచర్యలాయన్ని
సంతోష పెట్టలేదు. పలుకరించాను. నిష్ప్రయోజనం. నా
దుఃఖానికి మేరలేదు. ఆయన రోషంతో మందిరం దాటి అదృ
శ్యుడైనాడు.

ఆలోచనలికి హద్దులేదు. ప్రళయ మా సన్నమై నట్టైంది
నాకు. ఆకాశం మేఘాలతో నిండిపోయింది. చుక్కలు
లేవు. చంద్రుడు లేడు. మేఘాలలోంచి ఏవో నన్ను వేళా
కోళం చేస్తున్నాయి. నా సిబ్బందంతా ఆయన ఆజ్ఞచేత దూర
మైంది. మందిరమంతా వారి సిబ్బందితో నిండివుంది. నా
అన్న పిట్టలేదక్కడ. బంగారు పాంచాలికలు కన్నీళ్లు జారు
స్తున్నాయి అకారణంగా. ప్రత్యక్షంగా, కళ్లు కప్పక జరిగిం
చిన ఈ కథ ఎవరికి జ్ఞాపకం ఉండదూ? మందిరాన్ని చుట్ట
ముట్టిన భటులంతటా ఆయుధాలతో పోతపోసిన లోహపు
విగ్రహాల్లా వున్నారు. నా మాటలకూ, ఆవేదనకూ గది
గోడలు నవ్వాయేకాని, భటులలో చలనంలేదు. గది దాట
డానికి వీలులేదు. రక్తంతో చేతులు కడుగుకొనే ధనమదాం
ధులికి గుండెలుంటాయా? నా మృత్యుదేవత ఖడ్గదంతాలతో

భటుల ముఖంలో ప్రతిఫలిస్తూవుంది. అప్పుడు నిండుప్రాణం ఎల్లా ఉంటుంది? అందులో—వాంఛలతో వున్నది. ఊహించడం కూడా కష్టం ఈ విషయం. నే నెక్కడున్నానో నాకే తెలియకుండా పోయింది. దీనికంతకీ కారణం గాలిలో అపోహ. ఇంతకీ స్త్రీలు పురుషులచేతిలో లక్కబొమ్మలు. చెప్పడానికి కథ ముగుస్తోంది. ఇక ఆలోచించుకోవలసిందే నాటి నాహృదయ పరివర్తనాలు. మృత్యుదేవత నోరు తెరచింది. గది అంధకార బంధురమైంది. తృటిలో 'అమ్మా' అన్న పిలుపులేకే భౌతికశరీరం ఆ నాలుగుగోడల మధ్యా మట్టిలో పొరలిపోయింది."

"సంవత్సరమేనా తిరగలేదు. జమీ నామరూపాలు లేకుండా చేశాను. పరివారంతో సహా ఆయన కుటుంబం నా కాహారమైంది. 'ఆయన పక్షము' అనినవారందరూ నా దెబ్బ తిన్నారు. అంత పరాకాష్టతో పగసాధించాను. ప్రతీదీ దిబ్బచేర్చాను. ఆ మణిమయ భవనాలనిండా చెట్లూపుట్టలూ పెరిగి దిబ్బలయ్యాయి. ఎవరేనా ఆ దిబ్బలకేసి చూస్తే మన్నయ్యారన్నమాటే. నాకాదిబ్బలు రాత్రిళ్లు విహారస్థలాలు. ఆ దిబ్బలదగ్గిర ఏ జీవమూలేదు. ఆ ప్రదేశమంతా వెదురుపొదలతో, చిన్నచిన్ననీళ్ల పరియులతో చీమ దూరడానికేనా వీలులేని చిట్టడవై జీబు మంటోంది. నాకీ శాకినీ జన్మ ఏళ్లైవళ్లు. తర్వాత అనేకఅల్లర్లు చేశాను. అనేక మంచికార్యాలు చేశాను.

కోరిన రూపాలతో, పట్నాలనక, పల్లెలనక, అరణ్యాలనక తిరుగుతున్నాను. భూచక్రమంతా పరిభ్రమించాను. విశ్వంలో నాకు తెలియని రహస్యాలు లేవు.

అల్లా తిరుగుతూ తిరుగుతూ ఆకస్మికంగా రణస్థలశ్మశానం లోంచి తూర్పుకి పోతూవున్నాను. అక్కడ రాజమ్మని ఖననం చేయడానికి చేస్తూన్న ప్రయత్నం చూశాను. చెట్టు చాటుచేసి పిల్లని పరీక్షించాను. ఆమె అందం నన్ను మోహపెట్టింది, విచారపెట్టింది. మనస్సులో కోర్కెకూడా నిలిచి వుంది. అన్నివిధాలా రాజమ్మ నా కనుకూలంగా వుంది. రాజమ్మని గోతిలో పెట్టడానికి సిద్ధంగా వున్నారు. రాజమ్మ మృతదేహంలో ప్రవేశించాను. మృతిని పొందిన రాజమ్మ అమృతత్వాన్ని పొందింది. అల్లాంటప్పుడు ఎవరికి ఆనందం ఉండదు! నిద్రలోంచి లేచినట్టు లేచింది రాజమ్మ. ఇక నేను రాజమ్మనే!" "ఔను—ఔను" అని కేకలేశాడు రాజమ్మ తండ్రి ఆశ్చర్యంతో. రాజమ్మమృతీ, బ్రతుకూమాట వాస్తవమే అన్నాడు దుఃఖం మ్రింగుతూ. "వారికి ముద్దుల కూతురునై సంగీతసాహిత్యాలచేత సంతోషపెట్టాను. వారింటిలో నా పెత్తనమే చలాయించాను. అరసవిల్లిని పెళ్లాడి కుటుంబం నిలబెట్టాను. నా అదృష్టం వల్ల బ్రాహ్మణకుటుంబంలో పడినా మాంసం తినడం పోలేదు. అది జన్మసిద్ధం.

ఇది నా అవసానకాలం. ఈ జన్మ ఇహాపోతుంది. నా తొలి పేరు మోహినీదేవి."

రాజమ్మ శరీరంలోవున్న మోహిని పూసగ్రుచ్చినట్లు తన పూర్వవృత్తాంత మంతా చెప్పి, తనకొడుకు పదేళ్లవాడయ్యే సరికి సకలవిద్యలూ కరతలామలక మౌతాయనీ, జమీందారు అవుతాడనీ చెప్పింది. ఇల్లు కాలిపోతుందనీ, అందులో ఈశరీరం కాలిపోవాలనీ, మొదట తాను మరణించినవేళ ఇదేఅనీ అందరినీ పైకి వెళ్లమనీ చెప్పింది. అందరూ వీధిలోకి వచ్చారు. యతి ఎంతవరకూ మంత్రోచ్చాటన చేయాలో అంతవరకూ వీధిలోంచి చేస్తున్నాడు. ఇల్లు అంటుకొంది. మంటలు ఆకాశాన్ని అంటాయి. ఆకాశానికీ భూమికీ వొకే జ్వాలలా వుంది. పొలిమేర వూళ్లకికూడా ఆమంటలు కనిపించాయి. రాజమ్మశరీరం అగ్నిహోత్రంలో కలిసిపోయింది.

ఓ తేజస్సు ఆచీకటిలో మహాజ్వాలలోంచి బయలుదేరి ఆకాశంలో లీనమైంది.

# గంధర్వుడు

## ౧౧

బసవలింగం భార్య సుశీల కాపరానికివచ్చి పండక్కి పుట్టింటికి వెళ్లింది. వారి దాంపత్యం పువ్వూ తావీలాంటిది. వారి అన్యోన్యానురాగం వర్ణనాతీతం. సమానవయస్కులు. చిలకా, గోరింకాలావున్నారు. నిజంగా సుశీల సుశీలే. పండగ వెళ్లగానే తీసుకువచ్చాడు బసవలింగం భార్యని. ఆపగలు భర్తకి వంట చేసి పెట్టింది, సరదాగా మాట్లాడింది. రాత్రి భోజనమయ్యే వరకూ సంతోషంగా కాలంగడిచింది. వారి ఆనందానికి భంగం రాకుండా సంచరించారింట్లోవాళ్లు.

రాత్రి బసవలింగం సుశీలమంచాన్ని సమీపించాడు. ఆమె ఉగ్రురాలైంది. కళ్లెర్రచేసింది. తిట్టింది. భర్తని కొట్టి తలుపుతీసి అవతలికి తోసేసి తలుపు వేసుకొంది. ఇంట్లో అందరూ బసవలింగాన్ని చుట్టుకొన్నారు. అతని శరీరంమీది గాయాలు చూసి దుఃఖించారు. వారికి అనేక విధాలుగా వూహాలు వెళ్లాయి. ఇంతపనిచేసినందు కామెమీద తీవ్రకోపం వచ్చింది

కొందరికి. పెద్దింటివారం, పైకి తెలిస్తే బాగుండదని గుట్టు బయటపడకుండా వూరుకొన్నారు. ఆరాత్రి ఎవరికీ నిద్దర్లులేవు.

రాత్రి గడిచింది. సుశీలాగదివిడిచివచ్చింది. భర్తకిచేసే వుపచారాలుచేసి, ఇంట్లో పని చూసుకుంటూంది. బసవలింగం రాత్రి ఆమెచేసిన పనినిగురించి నిర్బంధించి అడిగాడు. "మీరు నాదగ్గిరే వున్నారు నేనేంచేశాను!" అని దుఃఖించింది. అడిగిన వారందరికీ అల్లాగే జవాబు చెప్పింది విచారంతో.

మర్నాడు, మూడోనాడు, నాల్గోనాడు, ప్రతీరాత్రీ అదే మోస్తరుగా జరుగుతోంది. రోజులు దాటాయి. వారాలు వెళ్లాయి. మాసాలతిక్రమించాయి. బసవలింగానికి సంసార సౌఖ్యం శూన్యమైంది. బసవలింగం రాత్రి భార్యగదిలో అడుగుపెట్టేసరికి ఇవతలికి వొచ్చిపడడం, గదితలుపు అప్రయత్నంగా మూసుకుపోవడం జరిగేది. సుశీల భర్తని తాకకుండానే జరుగుతోన్నపనిని ప్రత్యక్షంగా ఇంట్లోవాళ్లు చూశారు. వారికి సుశీలమీదవున్న కోపం పోయింది. సుశీలని అడిగితే పూర్వంలాగే జవాబుచెప్పేది. ఇదేదో పిశాచగుణమని గ్రహించి వాళ్లు దాన్ని వదలగొట్టే ప్రయత్నాలు ప్రారంభించారు. చాలామంది మంత్రవేత్తలు దేశదేశాలనుంచి వచ్చి చూశారు. చిల్లర మంత్రగాళ్లమాట ఎటున్నా మహామాంత్రికులు వచ్చి వారివారి మంత్ర ప్రభావాలు వినియోగించారు.

హోమాలుచేశారు. బలులువేశారు. దిగతుడుపులు పెట్టారు. తీర్థయాత్రలు చేయించారు. సుశీల వంటినిండా రక్షరేకులు కట్టారు. చేసిన ప్రయత్నాలెందుకూ పనికిరాలేదు. అంతా నిష్ప్రయోజనమైంది. ఎవరేమిచెప్పితే అవన్నీ యథావిధిగా చేశారు. లాభంలేకపోయింది. ఇహ ఆప్రయత్నం మానుకొనే స్థితి తటస్థించింది.

చాలాకాలం మంత్ర తంత్రాలతో గడిచింది. సుశీలలో మార్పేమీలేదు. ఒహనాడు విచారంతో తిరుగుతూన్న బసవ లింగానికి ఆరడుగుల ఎత్తూ, మేరుశిఖరంలాంటి జటాజూటమూ, ఆజానుబాహువులూ, ఆకర్ణాంత నేత్రాలూ, మెడ నిండా ఏకముఖీ, ద్విముఖీ రుద్రాక్షమాలలూ, చేతిలో కమండలం, యోగదండమూ, దండలకీ మొలకీ మూలికలూ, అడుగెత్తు పావకోళ్లు కాళ్లకీ, ఆపాదమస్తకమూ దట్టంగా విభూతీ కలిగి సాక్షాత్తూ రుద్రుడులా ప్రకాశిస్తూన్న సన్యాసి కనిపించాడు. బసవలింగం నేత్రాల్లోకి తీక్ష్ణదృష్టి ప్రసారించాడు. ఆచూపుతో బసవలింగం నిశ్చలంగా నిలిచిపోయాడు మాటలేక. అల్లావున్న బసవలింగాన్ని దగ్గిరికిపిలిచి, ఇంట్లో అతను పడుతూన్న బాధంతాచెపుతూ, "ఆదెయ్యంకోసం పదేళ్లై తిరుగుతున్నాను, ఇప్పుడేపోగొడతాన" న్నాడు సన్యాసి. మీరేమిచేయమంటే అదిచేస్తాను. మీరు చెప్పిన

వన్నీ మా ఇంట్లో జరిగాయి. జరుగుతూన్నాయి. దయ్యాన్ని వదలకొట్టుమని ప్రార్థించాడు బసవలింగం. రాత్రి పన్నెండు గంటల లోపునే వదలకొడతాను. పళ్లూ, కొబ్బరికాయలూ, సాంబ్రాణీ, కర్పూరం, పట్టుసామాన్లూ, చిత్రాన్నం, రకరకాల పిండివంటలూ సమకూర్చి భద్రపరచ మన్నాడు సన్యాసి.

ప్రొద్దుజారింది. చీకటిపడింది. దీపాలు పెట్టారు. సన్యాసి వస్తున్నాడు. వీధిమొగవున్నాడు. పనిచేస్తూన్న సుశీల పని విడిచి విసురుగా, గబగబా గదిలోకివెళ్లి తలుపువేసుకుంది. ఆగదికి ఒక టేద్వారం. చీమ దూరడానికేనా మరోసందులేదు. అల్లా సుశీల వెళ్లడం ఇంట్లోవాళ్లకి ఆశ్చర్యంవేసింది. సన్యాసి గుమ్మం సమీపించాడు. వస్తూన్న సన్యాసిని బసవలింగం ఎదుర్కొని లోనికి తీసుకువెళ్లాడు. 'నీ భార్యా ఎక్కడుంద న్నాడు'. గది చూపించాడతడు. తలుపు త్రోశాడు సన్యాసి. రాలేదు. తిరిగి గట్టిగా తలుపు తట్టాడు. బసవలింగం చేత కూడా కొట్టించాడు. తలుపు తీయలేదు. ఇంట్లో వారందరూ సావిడిలో నిశ్శబ్దంగా కూర్చున్నారు. వీధితలుపులు వేయు మన్నాడు సన్యాసి. మంత్రించిన వేరొకటి బసవలింగం ముంజే తికికట్టి ఆమె మీద పడడానికివస్తే చూపించమన్నాడు. మరో వేరు మంత్రిస్తూ జటలోంచి తీసి తాళంలా ఉపయోగించాడు.

తలుపు విడింది. సుశీల గదిలో లేదు. కలవరపడ్డారు. అల్లరి చేయవద్దన్నాడు సన్యాసి.

గదిలో సామానంతా తీయించి కడిగించాడు. పద్మాకారంలా పెద్ద పట్టువేశాడు. కొంతసేపు మంత్రోచ్చాటన చేసి వెళ్ళి దొడ్డిలో అటకమీదున్న సుశీల జుట్టుపట్టుకు తీసుకొచ్చాడు సన్యాసి. అటకమీదనుంచి దిగడానికి అల్లరిచేసింది సుశీల. సన్యాసి కర్రచేశాటప్పటికి మాట్లాడక కూడా వచ్చింది. గదిలోంచి దొడ్డిలో అటకమీది కేలావెళ్ళిందా అనుకొన్నారు. ఇదివరకెన్నడూ అలా మాయ మవ్వడంలేదు. పట్టులో కూర్చోపెట్టి మంత్రోచ్చాటన చేస్తున్నాడు సన్యాసి. మహిషాసుర మర్దనిలాగ గుభీల్మున లేచింది సుశీల. లేస్తూ సన్యాసి మెడ పట్టకారులా గట్టిగా రెండుచేతులా పట్టి నొక్కుతోంది. కొద్దిగా జంకాడు సన్యాసి. క్రిందపడేసి కంఠం నులిపేస్తూంది. చావుకేకలు పెడుతున్నాడు. అది చూస్తూ సావిడిలో ఉన్న వాళ్ళు మీద పడుతుందేమో అని గదుల్లోకి పరుగెత్తి తలుపులు వేసుకొపోయారు. బసవలింగం ధైర్యం తెచ్చుకొని పట్టుకోడానికి గదిలోకి వెళ్లాడు. సన్యాసిని విడిచి బసవలింగం మీదికి దుమికింది. తప్పించుకొని మరోగదిలో దూరి రక్ష చూపించాడు. మళ్లీ సన్యాసిమీదికి పరుగెత్తింది. అతను దిగ్బంధన మంత్రాలు ఉచ్చరిస్తున్నాడు. చాపచుట్టగా పట్టులో కూల

పడింది సుశీల. కళ్లుమూసుకుంది. జడ వేసి జడలోకి రప్పించాడు భూతాన్ని. జడ చేతితో పట్టుకొన్నాడు. సాంబ్రాణి ధూపం వేయమన్నాడు బసవలింగాన్ని. దట్టంగా పొగవేశాడు. కొబ్బరికాయలు కొట్టి ఆ నీళ్లు నెత్తిమీద పోశాడు. చిన్ననవ్వు నవ్వింది సుశీల. "మాదుగులసంతపేట మూట జ్ఞప్తి ఉందా?" అన్నాడు సన్యాసి. "ఆ—అప్పుడు నీకు దొరకకుండా ఆచీకట్లో తప్పించుకు పోయాను." "ఇక్కడికేలా వచ్చావు? నీ సంగతేమిటీ? చెప్పు" మన్నాడు సన్యాసి. అడిగీ అడగగానే తెల్లని గోడమీద అగ్నిజ్వాలలు పుట్టాయి. కళ్లుమూయక వింతగా చూస్తున్నారందరూ. జ్వాల లంతకంతకి హెచ్చాయి. అందులో తెనుగుఅక్షరాలు కనిపించాయి ఇల్లాగ—"గంధర్వుణ్ణి. పదేళ్లై భూలోకానికి వచ్చాను. పుట్టింటినించి సుశీలని తీసుకువస్తూ దారిలో మర్రిక్రింద విశ్రమించాడు బసవలింగం. అప్పుడు మూట ఆధారంగా చేసుకొని వచ్చాను. ఆమె సౌందర్యం......బసవలింగం రూపంతో గదిలో ఉంటున్నాను. అతణ్ణి కొట్టాను. రోజూ సాయంకాలమే ఆమెని ఆవహిస్తాను. అప్పుడామెకి మానవస్మృతి ఉండదు." మంటలు ఆరిపోయాయి. చూడ్డానికి వచ్చిన సోదెమ్మ భయంచేత క్రింద పడిపోయింది. చేతులమీద అవతలికి తీసుకువెళ్లారు. వంద కొబ్బరికాయలూ చూసే సరికి వట్టి పెంకులున్నాయి. గదినిండా

పెట్టిన చిత్రాన్నం, పిండివంటలూ వాసనేనా లేకుండా హారించి పోయాయి. ఇంట్లో మంచినీళ్ల బిందెలు కాళీ అయ్యాయి. ఆ సంగతి అప్పుడు వాళ్లకి తెలియదు.

మంత్రాలు చదువుతూ జడ కత్తిరించాడు సన్యాసి. సుశీల సిగ్గుపడిపోయి భర్తని చేరింది. కౌగలించుకొన్నా డతను. కత్తిరించిన జడ కమండలంలో వేసుకొన్నాడు. పట్టు పట్టుబట్టలో కత్తి సముద్రంలో కలిపివేయుమన్నాడు.

'సుఖీభవ, సుఖీభవ' అంటూ వీధిపడి చీకటిలో కనిపించ లేదు సన్యాసి.

# ప్రతిబింబాలు

## ౧౨

"అంగణములెన్ని, కేళీగృహంబు లెన్ని,
ఓడుబిళ్లల యిండ్లెన్ని, మేడలెన్ని,
కట్టిగాకేమి సూర్యప్రకాశరాయ
దుంగుటూరిండ్ల రాకాసులుండవచ్చు" (రామకవి)

"బావా! ఆ కనపడేవేనా మనమేడలు?"

"ఔనోయి రామకవీ—అబ్బా! నిన్నుచూసి ఎన్నాళ్లో యింది.

"కవులం కదా! ఇల్లు జరగాలి కాదటోయి."

"ఔను బావా! మాకు డబ్బున్నా లేనివాళ్లలో జమ. ఎంతకాలం నీ విక్కడున్నా ఇబ్బందిలేదని ప్రార్థించి చెప్పాను. నా మాట మన్నించావు కావు. నే పవిత్రుడనయ్యే యోగం లేదింతకీ. నీ వంటి కవిపాదాలు స్మరిస్తూ కాలం గడుపుదామని ఊహించాను. ఏదో దయకలిగి మా పుణ్యమా అని మార్గవశాత్తూ-ఈశ్వరుడులా ఈగృహప్రవేశకాలానికి వచ్చావు. నేను దశపూర్వేషాం, దశాపరేషాం అన్నట్టు మా వంశ

మంతా పవిత్రమయిందోయి, నీమూలంగా. ఇహ నాకే చింతా లేదు.

"ఎన్నిమైళ్లు వెడల్పుంటాయి బావా, మేడలూ? చూపు దాటాయి."

"ఊహించు."

"ఊహాతీతంగా ఉన్నాయోయ్."

"మేఘాలు మేడల సందుల్లోంచి వెడుతున్నాయి."

"లేదు."

"ఇంత ఎండలో ఆనక్షత్రాలేమిటోయి; అప్పుడే పదైంది!"

"పది దాటలేదు."

"ఇదేమిటోయ్; మేడలికి దూరంగా ఉండగానే గొడుగు వేసుకున్నట్టు చల్లగా వుంది."

"మేడలమీది అద్దాలవల్ల."

"అల్లాగా! ఓహో—ఏమి చల్లగా ఉంది!"

"..............."

"ఇందులో సింహద్వారం ఎక్కడా?"

"సరిగ్గా చూసి పోల్చుకో బావా! చూస్తాను."

"ఏమి పోల్చమన్నావూ అన్నిద్వారాలూ ఒక్కలా ఉన్నాయి. ఆసేతు శీతాచలపర్యంతం తిరిగాను. ఇల్లాంటి మేడలూ మిద్దెలూ చూడలేదోయ్. అద్భుతంగా కట్టించావు."

"అయితే లోపుకి నెడదాం."

"తలుపులూ?..."

"..............."

"ఆశ్చర్యంగావుంది. ఆచివర్ని మీాట నొక్కితే గోడలా అయిపోయింది. ఈద్వారం ఒక్కటేఉంది. ఇంత అందమైన ద్వారం ఇదివరకున్న వాటిల్లో లేదు. తక్కిన ద్వారాలేమై నాయి బావా!"

"ఇల్లారా..."

"ఇదేమిటీ! గుమ్మందా టేసరికి మేడమీాదికి వచ్చాము. ఇంత పెద్దచెరు వెందుకేమి టిక్కడ?"

"చెరువుకాదు; పెద్దహాలు."

"మయసభ జ్ఞాపకానికి వస్తోంది."

"ఈగదిప్రక్కని ఇంతజాగా కాళీగా విడిచారెందుకోయి?"

"అది—కాళీస్థలంకాదు; డాబా."

"అరే! బాగా మోసపోతున్నాను!"

"నీలాంటి కవులకు భ్రాంతేమిటీ! అనవలసి అల్లాగ అంటున్నావు."

"లేదు—లేదు; నిజంగా భ్రాంతి పడుతున్నాను."

"క్రొత్తవాళ్లకి అల్లాగే ఉంటుందిలే."

"..............."

## ద య్యా లు

“తెలియకుండా చాలా ఎత్తుదాకా వచ్చాము. ఆకనిపించే మేడశిఖరాలూ, డాబాలూ ఇందులోవేనా?”

“ఔను.”

“సింహాచలంలో నరసింహస్వామి ఆలయశిల్పంచూశాను. అక్కడి శిల్పంలాంటి శిల్పం జగత్తులోలేదు. శిల్పానికి సింహాచలమని ప్రసిద్ధి. ఆ స్తంభాలమీద చేసినపని బంగారంమీద చేసినట్టుంటుంది. అద్భుతం, ఆశ్చర్యమూను అదిచూస్తే. ఆశిల్పాన్ని మరిపిస్తోంది ఈ మేడల్లోని శిల్పం.”

“పనిచాలా జాగ్రత్తగా చేయించాను.”

“ఇక్కడికి పాపికొండలు బాగా కనపడుతున్నాయే!”

“ఔను. అదిగో, అవే.”

“ఎంతదూరం వచ్చాము?”

“ఓమైలే కదూ.”

“గృహప్రవేశం సాయంకాలం తోటేనా?”

“ఔను.”

“ఢిల్లీ పాదుషా భవనాలిల్లా ఉంటాయా? ఈ గదుల్లో ఒక గదికేనా పాదుషా దర్బారుహాలు పోలికకు దేనిలోనూ పనికిరా దనుకొంటున్నాను.”

“వారు చక్రవర్తులూ, వారికీ మనకీ పోలికేమిటి బావా! వారి భవనాల్లా మన ఇళ్లుంటాయా? ఎక్కడిమాట పోనిద్దూ. హస్తిమశకాంతరం, తెలుసా?”

# ప్రతిబింబాలు

"అధికారంలో చక్రవర్తే, నిజం."

"................"

"ఈచిత్రశాల లెన్ని ?"

"................"

"మన వెనకాతల ఎవరో తిరుగుతూన్నట్టుంది? మన ప్రతిబింబాలేనా అవి?"

"ఔను."

"ఆఁ—ఉఁ—ఉండు—ఉండు ఎవరో నిన్ను పిలుస్తూన్నట్టుంది చూడు."

"ఇప్పుడే వస్తాను, ఆగదులూ—అవీ చూస్తూ ఉండు. పని తొందర్లో ఒక నిమిషమేనా తీరిక ఉండదు. ఏమిచెయ్యమన్నావు, ఇల్లాగే ఉంటుంది ఎప్పుడూను."

౨

"ఈతలుపులిల్లామూసుకొని పోవుతున్నాయేమిటి? అబ్బా! పట్టుకున్నా ఆగడంలేదు. బావా......నాకేకవినిపిస్తుందా? ఎంతదూరంవచ్చానో? చెయ్యి కోసుకుపోతుందేమో? చేతులు నొప్పిపెడుతున్నాయి. తలుపు పట్టుకుంటే ఆగేటట్టులేదు. ఒదిలెయ్యాలి. అబ్బబ్బా! పోనీ పడిపోనీ...అమ్మా! విడవక పోతే చెయ్యి తరుక్కుపోను...ఏమిటి? తలుపు పడేసరికి

గోడలో గోడ అయిపోయింది. ? తలుపుగు ర్తైనాలేదు. దీనికి మీాట ఎక్కడో తెలియదు. ఓహో! ఆమూల—అదిగో—తలుపులు విడుతున్నాయి. ఈగదిలో పగలు దీపాలేమిటి? దీపాలుకాదు. దీపాల్లాఉన్నాయి గాజుముక్కలు.

అబ్బా! ఇవి ఎంతవిశాలమైన గదులూ. చాలాచిత్రంగా ఉన్నాయి. మా ప్రకాశరావు మయుణ్ణితెప్పించి కట్టించాడా ఈ భవనాలు ? ఈ గదిలోకి వచ్చేసరికి నెత్తికి తగులుతోంది పై భాగం. ఇప్పుడంతకంతకి పైకి లేస్తోంది. క్రింద నేల దిగుతోందా ? పై భాగం పైకి జరుగుతోందా ? పోల్చడం చాలా దుర్ఘటంగాఉందే! ఆగోడేమిటల్లా విడుతూంది. అయ్యో! హాలంతా గదుల్లా మారింది. ఈరెండుగోడలూ నన్ను నొక్కవుకదా ? మేడమీాదకెల్లావెడుతున్నానో తెలియకుండా వుంది. రావు నాకోసం చూస్తున్నాడేమో ? చాలాదూరం వచ్చాను. నేనెక్కడున్నానో అతనికెల్లా తెలిస్తుంది ? అతను కట్టినఇల్లతనికే తెలియదా ? ఈ పై భాగం వెండీ, బంగారంతో చేయించినట్టుంది. ఇక్కడద్వారాలూ, కిటికీలూలేవు—అదిగో ద్వారం. కిటికీలవిగో—వాటంతట అవే విడుతున్నాయి, మూసుకుపోతున్నాయి. ఎవరోవస్తూన్నట్టుంది—మాబావేనా? కాదు, కాదు. స్త్రీల పాదధ్వని. ఔనా ? కాదా ? అవే—మళ్లీవినిపించడంలేదు. స్త్రీలుఇందులో ఎందుకుంటారు ? వంట

ఇల్లుఎక్కడో? ఆ మేడలో నిప్పులు కనుపిస్తున్నాయి. అదేవంట ఇల్లుకాబోలు. గృహప్రవేశంకాకుండా నిప్పు ఎల్లావస్తుందీ? ఇప్పుడెందుకూనిప్పులూ? ఆ తలుపులు మూసుకుపోతున్నాయేమీ? అదుగోమాబావ వస్తున్నాడు. ఆమేడకీ, ఈ మేడకీ దారిలేదే, అల్లా ఎల్లావస్తున్నాడతను?—ఏడీ?—అతనుకాదు. నానీడే. నేను భ్రాంతిలోఉన్నాను. ఆమేడలోంచి ఈమేడకెల్లావచ్చాను?—ఆఁ—అద్దాలమేడ. ఏమిటీ? ఇన్నిగదులేమిటీ? లెక్కకిమించాయే.—

ఆకలి అంటూరెవరూ? ఆడవాళ్లున్నారు. అల్లా వెళ్లకూడదు. చంటిపిల్లల ఏడ్పు వినిపిస్తూంది. ఏమిటిదీ? క్రొత్త ఇంట్లో ఎవరూలేరే! దాహమంటూరెవరూ? ఈ స్తంభాల్లోంచి మాటలువస్తున్నాయి. ఆకిటికీమాట్లాడుతోంది. ఏమిటీ ఆమాటలు? స్పష్టతలేదుమాటల్లో. మనమాటలా లేదు. ఈ స్తంభంఏడుస్తోంది; ఇది నవ్వుతోంది. ఈ అరుగు ఇల్లాపొంగుతోందేమీ? దీనిలోంచి మాటలు వస్తూన్నాయి. ఒకమాటా స్పష్టంలేదు. ఆకుర్చీలమీద వారెవరూ? నన్నుపిలుస్తున్నారు. ఎందుకో? నాలాలేరు వాళ్లు. అంతసౌందర్యంగా ఉన్నవాళ్లని ఎప్పుడూచూడలేదు. నిర్వికారంగా ఉన్నారు. ఏలోకాన్నించి వచ్చారో? ఈ దూలాల్లోంచి మాటలేదేంటి! ఈ రాతిచిలక మాట్లాడుతోంది మనమాటలే! స్థావరాలన్నీ మాట్లాడు

తున్నాయి. వీటికిప్రాణం ఎల్లాఉంటుందీ ? అబ్బా ! చాలా భయంగాఉంది. కడుపులో తిప్పుతూంది. ఆ కుర్చీఏమిమాట్లా డుతోందీ ? ఆ కుర్చీ బల్ల దగ్గిరికెల్లా వెడుతోందో! ఎవరోఇద్దరు మాట్లాడుతున్నారు. పండితచర్చ జరుగుతూంది. వారెవరో తగుమనుష్యులు మాట్లాడుకుంటున్నారు. కనిపించడంలేదు. "బాకీఉంటేమాత్రం" అంటారేమిటీ ? ఈసోఫా 'ఆకలీ' అంటోంది. ఇదిఆకలిసోఫా ? కాదు: ఏదో చిత్రంఉంది ఇందులో. ఇంతమంచిగదిలో ఈ అల్లరేమిటి ? కళ్లుతిరుగుతున్నాయి. తలకి ఊహాలు అందడంలేదు. ఎవరో చంటిపిల్ల పాలంటుంది. ఈ గదిలో ఎవరేనాచచ్చిపోయారా ? చచ్చిపోతే ఇన్నిమాటలెల్లావచ్చాయి భిన్నభిన్నంగా ? వినడంకష్టంగాఉంది ఈ రాళ్లలో 'ఆకలీ' అన్నమాట—"

"బావా......"

"ఎందుకోయి పిలిచావు ?"

"ఇక్కడే ఉన్నావా ? ఇంకా రాలేదనుకున్నాను. ఇందులో మాటలు వింటున్నావా ?"

"వినకేమీ ? వింటున్నాను."

"ముందు నడు. వెనకున్నావు."

"ఫరవాలేదులే."

"చిత్రంగా కట్టించావు ఇల్లు."

ప్రతిబింబాలు

"చిత్రంకాదు మరీ; నెత్తురుపోసి కట్టించా ననుకో."

"నెత్తురేమిటోయి దీనికి?"

"పిచ్చివాడా! ఏమీ లేదూ ఊరుకో. నీకు తెలియదు".

"తెలియదంటావా?"

"తెలుస్తుందిలే ముందు."

"ఆ-అద్దాల్లో అలా ఉన్నాం—ఏమిటి?"

"అందులో అల్లాగ—"

"మనతో ఆడవాళ్లు రాలేదు. ఈ సౌందర్యవతు లెవరూ?"

"మనవాళ్లే నీకు తెలియదు. క్రొత్తగా వచ్చారు."

"మనలో నాకు తెలియనివా ళ్లెవరూ?"

"నీవు చూడకుండా మాయ......"

"ఎది? ఆమాట పూర్తిగా చెప్పు."

"ఎందుకులే తర్వాత."

"ఈ అద్దంలో నే నొక్కడనే కనిపిస్తానేమీ?"

"అది అల్లాగ—"

"ఇందులో ఇంత భీకరాకారంగా కనిపిస్తున్నా నేమీ?"

"లేదు."

"లేదంటా వేమిటి?"

"ముందుకి రా; బావా!"

"ఎందుకూ?"

# ద య్యా లు

"అబ్బా! కనపడకుండా తిరుగుతూ మాటలు చెపుతా వేమీా? నాతో హాస్యం అలవాటులేదే నీకు? ఈవేళ ఇల్లా ప్రారంభించా వేమిటి? భయంగా ఉందోయి; ముందుకి రా."

"కనపడతానా?"

"పోనీలే."

"..............."

"ఈ మణులూ, రాళ్లూ, స్తంభాలూ, ఆకలీ అంటున్నా యేమిటి ప్రకాశం?"

"అంటాయి.—వాటికీ—ఆకలే."

"ఈమాట లేమిటి?—అబ్బా!"

"..............."

"బావా — —"

"ఓహోయ్."

"ఎక్కడా?"

"ఇక్కడా."

"నీ వెవ్వరవూ?"

"నీ మేనమామ కొడుకుని."

"శాస్త్రిలా ఉన్నావు"

"ఔను; శాస్త్రినే."

"చచ్చిపోయావని విన్నానురా. బ్రతికే ఉన్నావా?"

# ప్రతిబింబాలు

"చచ్చిన మాట నిజమే. నీకు బావనే."

"పోయి పదేళ్లయింది కదూ?"

"ఆ—అయింది."

"ఆమె; ఎవరు?"

"మావాళ్లే తెలియదూ?"

"నీ భార్య బ్రతికి ఉంది."

"..................."

"ప్రకాశరావుబావా!......"

"ఎందుకూ?"

"ఈ అద్దాలూ, రాళ్లూ ఆకలంటా యేమిటి?"

"వాటిలో జీవా లున్నాయి."

"వీ రందరూ ఎవరురా?"

"హత్యచేయపడ్డవాళ్లూ, మరికొందరూను."

"ఏమిటోయ్- హత్యా!—బలవన్మరణమే?"

"..................."

"హత్యా..."

"..................."

"మాట్లాడవేమీ?"

"..................."

"ఆ మనిషి అంత పొడుగున్నాడేమీ?"

## దయ్యాలు

"..................."

"బావా!......"

"ఓహోయ్..."

"ఇల్లా రా!"

"ఇల్లా రా!"

"కనపడవేమీ ?"

"కనపడవేమీ ?"

"బావా..."

"బావా..."

"బాబూ...."

"బాబూ..."

"ఎవరు వారు ?"

"ఎవరు వారు ?"

"ఆ-య్..."

"ఆ-య్."

"ఈ గదికి దారి లేదు."

"లేదు."

"క్రింద ఎవ రున్నారు ?"

"ఎవ రున్నారు ?"

"కిందా, మీదా, అంతా అద్దాల మయమే !"

# ప్రతిబింబాలు

"అద్దాల మయమే".

"ఎవరా జవాబు?"

"..................."

"బావా..."

"ఊఁ......"

"దాహం"

"లేదు."

"మరేమిటుంది?"

"సంగీతం."

"ఆహా! ఏమి సంగీతం? ఎక్కడనుంచో?"

"స్వాతంత్ర్యలోకంలోంచి; బానిసీడా!"

"మేము బానిసలమే."

"కాకేమిా?"

"ముమ్మాటికీ బానిసలమే. స్వార్థ...లేదు—"

"మాకు స్వేచ్ఛ; ఆనందం."

"అబ్బా! కళ్లు మూసుకుపోతున్నాయి.—భయం, భయం. ఎవరో తెలియదా మాటలు. నాయనా! మిా రెవరూ?"

"..................."

"అంగణము లెన్ని, కేళీగృహంబు లెన్ని, "అబ్బా! తల తిరుగుతోంది"

దయ్యాలు

"......................"

"ఓడుబిళ్లల యిండ్లెన్ని?"

"ఓడుబిళ్లల యిండ్లెన్ని?"

"మేడ లెన్ని..."

"మేడ లెన్ని."

"కళ్లు మూసుకుపోతున్నాయి."

"పోతున్నాయి."

"కట్టిగా కేమి సూర్యప్రకాశరావ్యు—"

"కట్టిగా కేమి......"

"దాహం...దాహం..."

"దాహం...దాహం..."

"ఎవరది?"

"ఉంగుటూరిండ్ల రాకాసు లుండవచ్చు—"

"ఉంగుటూరిండ్ల రాకాసు లుండవచ్చు—"

"ఉంగుటూరిండ్ల రాకాసు లుండవచ్చు—"

"ఉండవచ్చు, రాకాసులు, ఉండవచ్చు."

"ఉండవచ్చు"

"రాకాసులు"

"ఉండవచ్చు"

"రాకాసులు"

"రాకాసులు"

"ఉండవచ్చు"

"ఉన్నాయి. చాలా ఉన్నాయి. ఉండవచ్చు—"

"రాకాసులోహోయ్!"

"రాకాసు లోహోయ్...... రాకాసులోహోయ్......
రాకాసు లోహోయ్!!!"

3

వ్యవహారంతొందర్లో మునిగిపోయిన ప్రకాశరావుకి రామకవిని ప్రొద్దుటాక్రొత్త భవనాల్లో విడిచివచ్చినసంగతి జ్ఞప్తికి రాలేదు భోజనాల వేళదాకా. భోజనానికి వెళ్ళేటప్పుడు జ్ఞాపకానికివచ్చాడు రామకవి. అతను ఏమయ్యాడో అన్న ధ్యానం పట్టింది. వెంటనే పరివారంతో క్రొత్తభవానాలదగ్గిరికి వెళ్లాడు, తనకు తానిందించుకొంటూను. ఆభవనాలకెదురుగా ఇసకతిప్పమీద ఎండలోపడిఉన్న రామకవి అతనిదృష్టికి తగిలాడు. స్మారకం లేకుండా పడిపోయిన రామకవిని ఇంటికి తీసుకువచ్చారు చేతులమీద. తగిన ఉపచారాలు చేయించాడురావు. కొద్దిగా తెలివివచ్చింది. కాని మామోలుధోరణిలేదు. అక్కడపడినవేదన పడుతున్నాడు. ప్రకాశరావు

భోంచేసి రామకవిదగ్గిర కూర్చుని ఉపచారాలుచేస్తున్నాడు.

రాత్రి గృహప్రవేశ సరంజాం జరుగుతూంది. రామకవి కలవరింతలు ప్రారంభించాడు. అవి అంతకంతకి హెచ్చాయి. భయంలేదంటున్నాడు ప్రకాశరావు. దయ్యాలంటూ భయంతో లేస్తున్నాడు. భూతాలేమిటి? బావా అంటాడు రావు. "దయ్యాలు, దయ్యాలు, ఆకలిరాళ్లూ, భూతాలూ, రాకాసులూవున్నాయి. అవిగో! అందులో!" అని కేకలు వేస్తున్నాడు రామకవి. రావుకామాటలేమీ అర్థంకాలేదు. "మనశాస్త్రి—బావా వాళ్లూఉన్నారు". శాస్త్రి అందులో ఎల్లాఉన్నాడనుకున్నాడురావు. బావబాగా జడుసుకున్నాడని మంత్రవేత్తలని పిలిపించి చికిత్సచేయించాడు. ఆచికిత్సలతో నిద్రపట్టింది రామకవికి.

సాయంత్రం అవుతూంది. క్రొత్తభవనాల్లో పెట్టడానికి కొంతసామాను పట్టుకువెళ్లారు. రామకవికి నిద్రపట్టగానే అతడాడినమాటల్ని గురించి ఆలోచిస్తూ పచారుచేస్తున్నాడురావు. వందలకొలదీ చుట్టాలతో కిటకిటలాడుతూంది ఇల్లు. మరో గంటకి గృహప్రవేశం. అనేక వినోదాలు జరుగుతున్నాయి. ఎవళ్లపనిలో వాళ్లుజాగ్రత్తగాఉన్నారు. క్రొత్తభవనాలకివెళ్ల డానికి సిద్ధంగాఉన్నారు. రావు గృహప్రవేశం మరచి ఆలోచనల్లోమునిగిపొయ్యాడు. ఆ ఆలోచనలికి తెగూతెంపూలేదు.

ఎవరితోనూ మాట్లాడడంలేదు. రామకవి పలవరింతలే అత న్ని కలవరపెడుతున్నాయి. అందులో 'దయ్యాలు' న్నాయన్న మాట మరీ అతన్ని బాధిస్తూంది. అతనికేమీ పాలు పోవ డంలేదు.

*　*　*　*　*

*　*　*　*　*

"ప్రకాశరావుబాబూ! చీకటిపడుతోందని వెళ్లాం. ఆమే డల్లో తాళాలూ, మద్దెళ్లూ వాయిస్తూ అపరమితంగా జనం ఉన్నారు. రూపాలు తెలియడంలేదు. సంగీతమో, ఏమిటో అద్భుతంగా ఉంది. సమీపానికి వెడితే రాళ్లుపడుతున్నాయి. ఫర్లాంగుదూరంలో నిల్చున్నాం. పగల్లాఉందక్కడ. మేడల పైనుండి క్రిందదాకా జనమే. చూడ్డానికి ధైర్యంలేదు. అంతా నాట్యమయం. సందడిగాఉంది. ఓసారినువ్వురావాలి. సామాను బళ్లుతిరిగి వచ్చేశాయి" అన్నాడు అచ్యుతం. ఆమాటలు వినేసరికి ఆబాలవృద్ధులకీ మతులులేవు.

"ఏమిటిరా ఆచిత్రం? బావమాటలునిజమేనా ఏమిటీ? ఇంకా ఆమాటలేమిటో అనుకుంటున్నాను. ఆ దయ్యాలే ఇవ తలపడేసినట్టున్నాయిబావని. ఎంతఘోరం! నడవండి అందరం వెడదాం. భూతాలు ప్రవేశించినట్టుంది అందులో—" అన్నాడు

రావు. మూడునాలుగు వందలమంది ఆ భవనాలదగ్గిరికి వెళ్లా[illegible] రాళ్లుపడుతూండడంచేత చాలాదూరంలో నిల్చిపోయా[illegible] రాళ్లుమాత్రంఎవరికీ తగలడంలేదు. అక్కడికొచ్చి పడు తున్నాయి పెద్దపెద్ద పాషాణాలు. చూడ్డానికి వెళ్లినవాళ్లల్లో క్షుణ్ణంగా మంత్రశాస్త్రం తెలిసినవాళ్లున్నారు. వెళ్లిన వాళ్లలో గుసగుసలుపుట్టాయి. ఎందుకో తెలియదు. "బలవం తంగా చస్తే ఏమౌతార"న్నారు కొందరునెమ్మదిగా. వీరికివార క్కడనుంచి వెళ్లిపొయ్యారు. ప్రకాశరావుదృష్టి మేడలమీద వుంది. అతను నిలువునా నీరువిడిచిపొయ్యాడు. నోటమాట లేదు. ప్రతిమలాఉన్నాడు. లక్షలు కర్చుపెట్టి శ్రమతోకట్టించిన భవనాలు ఎందుకూపనికిరాకుండా పాడవుతున్నాయి. ప్రకాశ రావు మంత్రవేత్తలవేపుకి దీనంగా దృష్టిసాగించాడు. వారు ప్రయోజనం లేదన్నట్టుచూశారు. నిమిషనిమిషానికీ మేడల్లో దయ్యాలసంఖ్య పెరుగుతూ ఉన్నది. ఆ కేకలకీ, ధ్వనికీనిల్వ లేకపొయ్యారు వెళ్లినవాళ్లు. భవనాలు కూలడం ప్రారంభ మయ్యాయి. తిరుగుమొహం పట్టారు విచారంతో. భవనాలు తెల్లవారేసరికి నామరూపాలులేవు.

ఇవే ఉంగుటూరు దిబ్బలు.

